| | | | | |
|---|---|---|---|---|
| టాక్‌టైమ్ | 20 | 20 | [illegible] | |
| ప్రయోజనం | లోకల్ మరియు STD కాల్స్ 1పై./2 సెకండ్ (రోజులో మొదటి 60 సెకండ్లు 1.5పై./సెకండ్‌కే ప్రతి లోకల్ మరియు STD కాల్ ఛార్జ్ చేయబడును) | అన్ని లోకల్ కాల్స్ 1పై./2 సెకండ్ | లోకల్ మరియు STD కాల్స్ 1పై./సెకండ్, ₹ 20, 30, 35, 50, 55,100, 110 RC పై ఫుల్ టాక్‌టైమ్ | 17500 లోకల్ సెకండ్లు |
| వ్యాలిడిటీ | 180 రోజులు | 90 రోజులు | 180 రోజులు | 20 రోజులు |

## BlackBerry వోచర్లు

| MRP | 112 | 143 | 451 |
|---|---|---|---|
| ప్రయోజనం | అన్‌లిమిటెడ్ ఇంటర్‌నెట్ బ్రౌజింగ్ \| 10 ఇమెయిల్ అకౌంట్స్ మరియు 10 చాట్ అకౌంట్స్ కాన్ఫిగర్ చేయండి \| అన్‌లిమిటెడ్ BBM | అన్‌లిమిటెడ్ BlackBerry మెసెంజర్ | అన్‌లిమిటెడ్ ఇంటర్‌నెట్ బ్రౌజింగ్ \| అకౌంట్స్ మరియు 10 చాట్ అకౌ చేయండి \| అన్‌లిమిటెడ్ |
| వ్యాలిడిటీ | 7 రోజులు | 30 రోజులు | 30 రోజులు |

## వోచర్లు

| MRP | 10 | 20 | 30 | 50 | 100 |
|---|---|---|---|---|---|
| | 6.90 | [illegible] | 23.70 | 41.50 | 86 |

# బొమ్మ - బొరుసు

కమలాకాంత్

జయంతి పబ్లికేషన్సు
గోపాలరెడ్డి రోడ్ :: విజయవాడ - 2.

# అంకితం

నా ఉజ్జ్వల భవితవ్యాన్ని కాంక్షించే
బావ వెంకట్, చెల్లి రాజీలకు

కమలాకాంత్,

# బొమ్మ బొరుసు

○ మనిషి మనసు నవనీతం కన్న మృదులం. నవపేశల సదృశం అది. ప్రేమకు బానిస. ద్వేషానికి శత్రువు. బొమ్మ బొరుసుల్లా మృదులత, కర్కశత దాని స్వభావాలు. ప్రేమ మృదులత్వం రంగరించితే, ద్వేషం మనిషిలోని క్రౌర్యాన్ని ప్రకోపిస్తుంది. సంఘం మనిషితో ఆడే బొమ్మబొరుసు ఆటలో మనిషి బొరుసులా నిరసనగా పరాజయం పొందు తున్నాడు — సంఘానికి ఆట [illegible]. మనిషిలోని మంచిని ప్రేరేపించి వెలికి తీసే [illegible] సంఘంలోనే వుంది [illegible] తెలిసి. మనిషిని ద్వేషించి [illegible] మనిషిలోని మంచిని హత్య చేసినందుకు, తనకు [illegible] సంతరించుకున్న పరిణామాలకు, సంఘమే బాధ్యత వహించాల్సి వస్తుంది. ○

యీ ఉపోద్ఘాతానికి, పిచ్చిగాడి జీవితానికీ నూటికి నూరుపాళ్ళ సామ్యం కనిపిస్తుంది—

పిచ్చిగాడు మంచివాడు. వాడి పేరునుబట్టి ఒక్కొ పిచ్చి వాడేనని అపోహపడే ఆస్కారం వుంది. కాని పిచ్చిగాడు పిచ్చివాడు కాదు. చెడ్డవాడు అంతకన్న కాదు. వాడెంత

మంచివాడో చెప్పేకంటే వాడి మనసునకు బొమ్మ ఒక్కటే వుందని, బొరుసు లేదని చెప్పొచ్చు.

బొమ్మలాంటి మనసుతో బాటు రెమ్మలాంటి భార్య వుంది పిచ్చిగాడికి వాడితో సంబంధమున్న సంఘం పెద్దదేం కాదు. అసలు పిచ్చిగాడు వూళ్ళో ఎవరితోనూ అనవసరంగా జోక్యం కలిగించుకోడు. తన పనేదో తను చూసుకుంటాడు. యిహ పిచ్చిగాడితో లావాదేవీలున్న సంఘం నలుగురు మనుషుల కూడిక. నలుగురిలో పుండరీకాక్షయ్యా మొదటి స్థానం ఆక్రమిస్తాడు.

పుండరీకాక్షయ్యా - ఆయన ఆ వూరి కరణం. వంద ఎకరాల మాగాణి, పాతిక ఎకరాల కొండ్ర — యింకా వూరి బయట పుష్కరాలవ ఒడ్డున తాటి తోపు, మనుమలు, ముని మనుమలు వారి సంతతి కూడ నసతిగా వుండగగిన విశాల మైన పెంకుటిల్లు. సమృద్ధిగా పాడి గొడ్డూ - గోదా ఆ వూరిలోని బాగా వున్న కొంతమంది భూస్వాముల్లో ఒకడు బాగా వున్న మిగతావారికి, కరణం పుండరీకాక్షయ్యకు ఒకే ఒక్క తేడా వుంది. పుండరీకాక్షయ్యతో ఆస్తిలో పోటీ వున్న మిగతా ఆ సాములకు ఆయనకున్న గౌరవం లేదు. ఆయనకున్న స్ఫటికంలాంటి మనసు లేదు. వూరు వూరూ పుండరీకాక్షయ్య అంటే ప్రాణం యిస్తుంది. పుండరీ కాక్షయ్యా మీద యీగ వాలనివ్వరు ఆ గ్రామస్తులు. గ్రామ స్తులకు ఆయన సాక్షాత్తూ దివినుండి భువి కేగి వచ్చిన పర మాత్మ స్వరూపం. చేయిచాచి అర్థించిన వాడికి లోకేత్యం

దాక్షిణ్యం లేకుండా సహాయం చేయడమే ఆయనమీద వూరి వారికిగల గౌరవానికి కారణం.

ఆయనకు యింత భూమి పుట్రా – గొడ్డు గోదా వుండగా ఆయన సావిడిలోని ఒక ఎద్దు ఖరీదు కూడ చేయని యీ కరణీకం ఎందుకు వదలడు అని సందేహం రావచ్చు. కరణీకం పుండరీకాక్షయ్యకు ఏడు తరాలుగా సంక్రమిస్తూ వస్తున్న వృత్తి. అలాగని పుండరీకాక్షయ్య పూర్వీకు కారులు ఆ ఒక్క కరణీకం మీదనే ఆధారపడి జీవించారని కాదు–

కరణీకం వారికి ఎలా సంక్రమిస్తూ వస్తున్నదో, వారి ఆస్తికూడా తర తరానికీ వృద్ధి చెందుతూ యింతకు రెండింతలై వీరికి చెందుతూ వస్తూనే వున్నది. యింతకీ పిచ్చిగాడికీ, పుండరీకాక్షయ్యకూ గల అనుబంధం, సంబంధం యీనాటివి కావు. పిచ్చిగాడు పుండరీకాక్షయ్య పాలేరు.

పుండరీకాక్షయ్యకు కరణీకం ఎలా వంశానుగతంగా సంక్రమిస్తూ వచ్చిందో పిచ్చిగాడికి ఆ వూడిగంకూడ రెండు మూడు తరాలుగా క్రమం తప్పకుండా వస్తున్న జీవనాధారం. పిచ్చిగాడి తండ్రి కరణంగారి తండ్రి హయాంలోనూ పుండరీకాక్షయ్య హయాంలో కొంతవరకూ పాలేరు. అలాగే పిచ్చిగాడి తాతకూడ పుండరీకాక్షయ్య తాతగారి హయాం లగాయితూ ఆయన తండ్రిగారి హయాంలో కొంతకాలం కరణాలకి వూడిగం చేశాడు. కారణం కారణాల మర్యాద, మన్ననలు, ప్రేమ, దయాధర్మాలు అలాంటివి. అందుకనే

వేరే ఏమీ వ్యాపకం పట్టుకోకుండా మూడు తరాలుగా కర ణాలపై ఆధారపడి బ్రతుకుతూ వచ్చింది పిచ్చిగాడి కుటుంబం.

కరణంగారి తండ్రి తమను నమ్ముకొన్నందుకు మూడు తరాలుగా తమనే భక్తితో కొలుస్తున్నందుకు మూడెకరాల మాగాణి రాసికూడ యిచ్చారు. అదే కారణం పిచ్చిగాడిని కరణాలనుండి విడిపోనివ్వలేదు. పిచ్చిగాడికి ముగ్గురు తమ్ముళ్లు. పిచిగాడికీ, తమ్ముళ్ళకీ కూడా వివాహాలు కరణం గారి పెద్దతు వల్లనే జరిగినై. పిచ్చిగాడు కష్టజీవి. తమ కుటుంబం మూడు తరాలుగా నమ్ముకున్న దేముళ్ళ లాంటి కరణాల్ని సేవించ డంలో ఒళ్ళు దాచుకోడు వాడు ముగ్గురు తమ్ముళ్ళ సహా యంతో మాసూళ్ళలో నాలుగెకరాల చక చకా తిప్పి సునా యాసంగా పని పూర్తి చేస్తాడు. యిలా పిచ్చిగాడి పూర్వీ కుల్ని ప్రేమతో దరికి తీసింది పుండరీకాక్షయ్య. పూర్వీకు లయితే పిచ్చిగాడిని, పుత్రవాత్సల్యంతో దగ్గరకు తీసింది పుండరీకాక్షయ్య. వారిద్దరి మధ్యగల అవినాభావ సంబంధం, మునుపటి అనుబంధం యిది—

౩ ౩ ౩

పిచ్చిగాడికి కరణాలంటే ఎంత మమకారం వుందో అంతకంటె ఎక్కువ మమకారం కల్లుమీద కూడ వున్నది.

త్రాగుడు వ్యసనం యీ కాలంలో గొప్ప గొప్ప

సంస్కారులకీ, పెద్ద పెద్ద కుటుంబీకులకే అబ్బగా, పిచ్చిగాడికి అలవడ్డంలో అబ్బురం లేదు.

పుష్పకాలవ ఒడ్డున తాటి తోపుల్లో లుట్టి కట్టడం, ప్రతిదినమూ క్రమం తప్పకుండా కల్లుతాగడమూ పిచ్చిగాడికి ఒక వయసు వచ్చినప్పటినుండీ అబ్బిన వ్యసనం. ఆ అల వాటే పిచ్చిగాడికి మరో ముగ్గురితో సంబంధమూ, లావాదేవీలు, ఏర్పరచింది.

మధ్యపాన నిషేధ చట్టం తూ.చ. తప్పకుండా అమలు జరుపబడే ఆంధ్ర దేశపు ఆ మూల కుగ్రామంలోని మునసబు వీరస్వామి నాయుడుకీ, ప్రొహిబిషన్ యిన్స్పెక్టరు 'సంతోషా'నికి ఏటా సీజన్‌లో కొన్ని వేల రూపాయల ఆదాయం. లైసెన్స్ లేకుండా దొంగచాటుగా 'తాడి'కి లుట్టి కట్టినందుకు తాగే ప్రతివాడూ సీజనుకు సరిపడా మామూలు ఒకసారే సమర్పించుకోవడం, అది మునసబు దగ్గర్నుండి యిన్స్పెక్టరు పై అధికారులు కూడా వాటాలుగా పంచుకోవడం ప్రతి సీజనులోనూ జరిగే ఆనవాయితీ వ్యవహారం. ప్రతియేట పిచ్చిగాడు కూడ కట్నం చదివించుకుంటూనే వున్నాడు. యిలా. వ్యసనం మునసబునీ, సంతోషాన్ని కాకుండా మునసబు పాలేరు కూడ పిచ్చిగాడికి దగ్గరగా జేర్చింది. వాడే చంద్రిగాడు మునసబు బంటు మునసబుకీ, పిచ్చిగాడికీ మధ్య లావాదేవీలు మాట్లాడడం అతగాడే.

మునసబు వీరస్వామి నాయుడిది భారీ ఎత్తు విగ్రహం. ఖంగుమమనే కఠం. పిచ్చిగాడికి కల్లు పిచ్చి ఎలా

పట్టిందో, మునసబుకి పిల్ల పిచ్చి అలానే అబ్బింది. మునసబుకి ప్రతిరోజూ ఒక పల్లెపడుచు కావాలి. ఆయన అంత పసిపడూ, అతని కాను వాంఛ అంత బలీయమైనదీనూ.

గ్రామంలో కరణానికీ తనకు గల గౌరవాలలో తార తమ్యానికి, మునసబుకు కరణం అంటే మంట. తను పూరికి మునసబు. పుండరీకాక్షయ్య కరణీకానికున్న గౌరవం తనకు లేకపోయింది.

మునసబు పిచ్చిగాడిని తనవైపు తిప్పుకోవాలని ఎన్నో విధాల ప్రయత్నం చేసాడు. పిచ్చిగాడిని కరణాలను వదిలేసి తన దగ్గరకు రమ్మన్నాడు. పిచ్చిగాడు ససేమిరా రానన్నాడు. తరతరాలు ప్రేమతో ఆదుకుంటున్న కరణాలను వదలడం తనకు కుదరదని స్పష్టంగా చెప్పాడు పిచ్చిగాడు. అందుకని పిచ్చిగాడన్నా మునసబుకి మంట.

ప్రతి సీజనులోనూ అడక్కుండానే తన ముడుపు చెల్లించుకునే పిచ్చిగాడికీ, మునసబుకీ వ్యవహారం బెడిసింది. కరణాలను వదలలేనని ఖచ్చితంగా చెప్పడం ఒక కారణ మయితే, పిచ్చిగాడి భార్య – ఆమె అందం రెండో కారణం. పిచ్చిగాడి భార్య అందమైనది గాకపోతే మునసబు దృష్టి పిచ్చిగాడివైపుకు మళ్ళకు పోను. అంతా సాక్షీగా. జరిగిపోను–

కాని — ఆనాటి సాయంత్రం.

ꣲ ꣲ ꣲ

ఆనాటి సాయంత్రం. పడమటి కొండల్లో పవళించ బోయే సూర్యుడి మొహం తుమ్మల్లో ప్రొద్దుగూకి నట్లుంది.

పుష్పకాలవ ఒడ్డునే అప్పుడే చెట్టుకు లుట్టి కట్టి కల్లు కత్తి, బంధాలు పట్టుకుని తాపీగా వస్తున్న చంద్రిగాడు ఎదురయ్యాడు.

పిచ్చిగాడ్ని చూసి చంద్రిగాడు నవ్వాడు.

'ఏందిరోయ్ చంద్రిగా... ముసిముసి నవ్వులు నవ్వుతుండావ్. ఏంది కత?'

'నీ కోసమే వస్తుండా ... దొరగారు నీ దగ్గరకే పంపారు.'

'యింకేటి... నా ముడుపు ముందే యిస్తిని గదట్రా!'

'రేపు సాతోషం' నస్తున్నాడంట. మొకట ఇచ్చింది చాలదంట. మళ్ళా పాతికా పరకా ఏగుసు పోవడానికి వస్తున్నాడంట'

'యిచ్చేదేదో మొదటే ముట్ట సెప్పుకొన్నాగా... యింకేమీ నా దగ్గర లేవు.'

'అలాగయితే కుదరదంట... యిచ్చి తీరాలంట'

'నన్ను సంపినా నా దగ్గర సిల్లి గవ్వ లేదు'

'యివ్వకపోతే యీ తోపుల్లోకి రావద్దన్నారు'

'నేను కట్టేది కట్టేదే... యింకా యిచ్చేది మాత్రం లేదు... ఏమన్నా చేసుకోమను.'

'ఆమాటే సెప్తుతా' అంటూ చంద్రిగాడు వెళ్ళిపోయాడు.

ॸ ॸ ॸ

పుండరీకాక్షయ్య పొలం నూర్పిళ్ళలో పిచ్చిగాడికి క్షణం తీరిక లేకుండా వున్నది కరణంగారి పొలంతో బాటు పిచ్చిగాడు తనవంతు మూడెకరాల వరికూడ కుప్పలు వేసాడు. కోతలతో, నూర్పిళ్ళతో క్షణం కూడ వెసులుబాటు దొరకకుండా వున్నది పిచ్చిగాడికి.

ఆ వేళకూడ పిచ్చిగాడు తీరికలేక పొలంలోనే వుండాల్సి వచ్చింది. ఆ రాత్రి పిచ్చిగాడు భార్యే అన్నం కట్టుకు పోయింది పొలానికి. పిచ్చిగాడు, తమ్ముళ్ళూ ఆ రాత్రికి పొలంలోనే వుండాలి.

అన్నం మూట యిచ్చి తిరిగి వస్తున్న పిచ్చిగాడి పెళ్ళాన్ని మసక చీకట్లో చంద్రిగాడు చూసి, వీధి మొగదల మర్రిచెట్టు నీడల్లోకి తప్పుకున్నాడు – చంద్రిగాడు గబగబా మునసబు యింటివేపు దారి తీసాడు.

చీకటి చిక్కగా, చిక్కగా అల్లుకుంది. అర్ధరాత్రి కటిక చీకట్లో పిచ్చిగాడి యింటిముందు ముసిలి చింతమాను వెనుక ఏదో మానవాకారం పొరట్లాడింది. యిటూ అటూ చూసి పిచ్చిగాడి యింటి వాకిలి తలుపు మెల్లిగా తట్టింది.

పగలల్లా చాకిరితో అలసిపోయిన పిచ్చిగాడి భార్య అకస్మాత్తుగా నిద్రనుండి వులిక్కిపడి మేల్కొన్నది.

'ఎవరూ!—'

'.........'

ఆకారం జవాబు యివ్వకుండానే తిరిగి తలుపు మెల్లిగా తట్టింది.

పిచ్చిగాడి భార్యకు అనుమానం కలిగింది. ఎవ్వరూ అంటే పిచ్చిగాడైతే నేనే లేవే తలుపు తియ్యవే' అనేవాడు. పోనీ మరదులయినా పలికేవాళ్ళే. ఆశ్చర్యంగా వుంది. ఆశ్చర్యంతో బాటు భయం కూడా ఆవరించిం దామెను.

దొడ్డి వాకిలి తెరిచి ఎదురింటి రాఘవయ్య మామను పిలిస్తే, వాకిట్లో ఆ గంతకుడు పారిపోతాడేమో!... పిచ్చిగాడి పెళ్ళాం కొంచెం ఆలోచించి, వంటింట్లోకి వెళ్ళి రోకలి తీసుకుని, లాంతరు హెచ్చించి, తలుపు గడియ తీసింది.

లాంతరు వెలుతురు మునసబు నాయుణ్ణి పరిచయం చేసింది పిచ్చిగాడి భార్యకు. ఆమె నిర్విణ్ణురాలే అయింది. మునసబు గురించి వూరూ వాడా కోడై కూస్తుంటే పిచ్చిగాడి భార్యకు తెలియకుండా పోదు. మునసబు విషయం అందులో ఆ గ్రామంలోని సంసార పక్షంగా వున్న ప్రతి ఆడదానికీ మునసబంటే హడలే. అయినప్పుడు యింత అర్ధరాత్రి పనికట్టుకుని మునసబు రావడంలోని అంతర్యం ఏమిటో పిచ్చిగాడి భార్యకు అవగతం కావడం, మునసబు లోనికి పాదం మోపుతుండగా, ఆమె చేతిలోని రోకలి మునసబు తల చితక కొట్టడం ఒకేసారి విప్పలో జరిగినై.

అర్ధరాత్రిపూట నానా రభస జరిగింది. వూరంతా పాకిపోయింది యీ విషయం. మునసబు తలకు బలమైన గాయమే తగిలింది. మునసబు విషయం తేట తెల్లమే కాబట్టి మునసబుకు కూడ బొంకడానికి ఆస్కారం లేకపోయింది.

2)

తెల్లారి పొలంనుండి తిరిగివచ్చిన పిచ్చిగాడు పగబట్టిన త్రాచే అయ్యాడు - అయినా ఆయన మునసబు - తను చిన్నవాడు – పాలేరు...ఏం చేయ కల్గుతాడు.

ఽ ఽ ఽ

నెలరోజులు అనంతరం సాయంత్రం మసక చీకట్లో కుప్పు కాలవ ఒడ్డున తాళ్ళలో లుట్టి కట్టున్న పిచ్చిగాడికి చంద్రిగాడు రావడం కనిపించింది.

'తాడి ముట్టుకోవడానికి వీలులేదని చెప్పమన్నారు దొరగారు' అన్నాడు ధీమాగా చంద్రిగాడు.

'వాడు నీకు దొరగాని, నాకు కాదు - ఏమన్నా చేసుకోమను... నేను మాత్రం మానను.'

'ఏరోయ్ ...తల బిరుసుగా వుంది వ్యవహారం.'

'ఏటా తినే దొంగడబ్బు మునసబు బాబుగాడి ఆస్తిలోనిది కాదని చెప్పు. నేను కట్టేదే. నీ పని వెళ్ళి చెప్పడమే. పిచ్చిగా యిక్కడ వాగావంటే ఒళ్ళు హూనం అవుతుంది జాగ్రత్త.

చంద్రిగాడు వున్నవీ లేనివీ కల్పించి చెప్పే వుంటాడు మునసబుతో.

లేకపోతే ఒకరోజు తెల్లవారుఝామున తాటి తోపుల్లో లుట్టి దించుతున్న పిచ్చిగాడికి చెట్టు దిగగానే ఎదురుగా చంద్రిగాడు, సంతోషం, మునసబు కనిపించక పోయే వుందురు. చంద్రిగాడు పిచ్చిగాడి చేతిలోని ముంత గుంజుకున్నాడు కసిగా. పిచ్చిగాడు ఎదురు తిరగాడు. లాభంలేక

పోగా మునసబు చంద్రిగాడు నవ్వుకుంటూ యింటికి పోతుంటే, పిచ్చిగాడికి సంతోషం వెంబడి వెళ్ళాల్సి వచ్చింది.

పిచ్చిగాడి మీద కేసు పెట్టాడు సంతోషం. తర్వాత పిచ్చిగాడికి యిన్స్పెక్టర్‌మీద తిరుగబడినందుకు, లైసెన్సు లేకుండా తాడిని వాడుకొన్నందుకు మధ్య నిషేద చట్టం క్రింద నెలరోజుల జైలుశిక్ష విధించారు.

తర్వాత పుండరీకాక్షయ్య జామీనుమీద పిచ్చిగాడు యింటికి జేరడమనేది వేరే విషయం.

౽ ౽ ౽

పిచ్చిగాడి భార్య వడ్డించిన దెబ్బ నయం కావడానికీ తర్వాత అవమాన వ్రణం మానడానికీ కొన్ని రోజులు పట్టింది మునసబుకి. వూరూ వాడా ఏకమై పిచ్చిగాడి భార్య ధైర్యాన్ని శ్లాఘించారు.

ఆ సంఘటన తర్వాత పిచ్చిగాడితో ఏదో విషయంలో కయ్యానికి కాలు దువ్వుతూనే వున్నాడు మునసబు.

తిరిగి మాసూళ్ళు కూడ వచ్చినై. పిచ్చిగాడికి మళ్ళీ చేతినిండా పని పడింది. కరణంగారి ఒక ముప్ఫై ఎకరాల పలక ప్రక్కనే మునసబుల కొంత చేనుకూడ వుండడంతో నీటి దగ్గర చంద్రిగాడికీ పిచ్చిగాడికీ కొట్లాట జరిగింది.

రోజూ సాయంత్రం పిచ్చిగాడు కాలవ మళ్ళించి గట్టు కట్టి యింటికి వెళ్ళేవాడు. సాయంత్రంనుండి రాత్రంతా కరణాలు నీరు పెట్టుకుంటే, పగలు నీరు వాడుకునే వంతు మునసబులది. ఆ పద్ధతి ప్రకారం జరిగిపోయేది ఎప్పుడూ.

కాని యీ తడవ మాత్రం రాత్రి మళ్ళించి వెళ్ళిన పిచ్చిగాడికి ప్రొద్దున్నే కట్ట తెంపడానికి వెళ్ళినప్పుడు కరణాల చేను అలాగే వుండడం నీరు మునసబుల పొలంలోనికి పోతుండడంతో, అదేదో తేల్చుకుందామని ఒకరాత్రి కాపు కాసాడు పిచ్చిగాడు.

బాగా చీకటి పడ్డాక నీళ్ళు మళ్ళించడానికి వచ్చిన చంద్రిగాడు దొరకనే దొరికాడు పిచ్చిగాడికి. చంద్రిగాడిని గట్టు కొట్ట వద్దన్నాడు.

'ఎవడికి చెప్పుకుంటావో చెప్పుకో నేను మానేదిలేదు' అని బింకంగా పలికాడు మునసబు వత్తాసు తీసుకుని. పిచ్చిగాడు అడ్డుపోగా చంద్రిగాడు చేయిచేసుకున్నాడు పిచ్చిగాడి మీద. పిచ్చిగాడు కలయబడ్డాడు. మెల్లిగా చెప్పబోయిన తాతమీద చేయి చేసుకున్న చంద్రిగాడి పై కోపం ఆగింది కాదు. కలయబడి, చంద్రిగాడిని చితక తన్నాడు. బాగా దెబ్బలు తగిలిన చంద్రిగాడు పారిపోయి మునసబుకు మొర పెట్టుకుంటే, ఫలితం పిచ్చిగాడ్ని ముద్దుగా పోలీసులు పిలుచుకు పోయారు పిచ్చిగాడికి నెలరోజులు జైలు శిక్షపడ్డది. యీ సారి పుండరీకాక్షయ్యే ఆదుకున్నాడు పిచ్చిగాడిని. మునసబుపై పిచ్చిగాడికి మంట మరీ ఎక్కువైంది.

✻ ✻ ✻

పిచ్చిగాడు తాడికి లుట్టి కట్టడం మానలేదు. యిది వరకు మునసబుతో బెడిసికొట్ట నంతకాలం బాహాటంగా చేసేవాడు. యిప్పుడు వూరు మాటు మణిగిన తర్వాత కట్టు

న్నాడు. తెల్లవారు ఝామున చీకటి వుండగానే వెళ్ళి లుట్టి తెచ్చు కుంటున్నాడు.

౭ ౭ ౭

ఒక రోజు... ఆ రోజు తెల్లవారుఝామున చీకటి పొరలు పొరలుగా వుంది. వుప్పుకాలవ చల్లటి ప్రవాహం మీదుగా వీచిన చల్లటి ప్రాతఃకాలపు గాలి తెరలు తెరలుగా వస్తుంటే తాటితోపులో తాళ్ళ తలలు జీబురు దెయ్యాల్లా వూగుతూ ఆకులు గరగర శబ్ద చేస్తున్నయ్.

కల్లు కత్తి బొడ్లోదోసి బంధం తగిలించుకుని లుట్టి కోసం చెట్టెక్కాడు పిచ్చిగాడు.

గాలికి చెట్లు వికటాట్టహాసం చేస్తూ దెయ్యాల్లా తల లూపుతూ వూగిపోతున్న వూగిసలాటలో చెట్టు ఎగబ్రాకడం కష్టంగా వుంది పిచ్చిగాడికి. ఎలాగైతేనేం శ్రమపడి ఎగ బ్రాకాడు –

బంధం ఆసరాగా నడుంమీాద చేరగిలి లుట్టి వూడ తీసిన పిచ్చిగాడికి చీకట్లో ఒక మానవాకారం తన చెట్టు క్రిందికే రావడం లీలగా కనిపించింది. తాడిచెట్టులాగా పిచ్చి గాడూ వూగిపోయాడు. వాడి వక్షస్థలం వుబికింది. పటపట కొరికాడు. మునసబు... తన వెనుకే పడ్డాడు. వీడి పని పట్టాలి పొగ రణచాలి. వెధవ... నీతి, నిజాయితీ రెండూ లేవు. డబ్బుతిని ద్రోహం చేసాడు తనకు. పుణ్యాత్ముడు పుండరీకాక్షయ్య విడిపించడం వల్లగాని, లేకపోతే తను జైలు శిక్ష కూడ అనుభవించాల్సి వచ్చేది.

మళ్ళీ తనను పట్టించడానికి వచ్చి వుంటాడు. ఆ సంతోషంగాడూ, చంద్రిగాడూ వీడు ఎంత అంటే అంత. వెధవలు అంతా.

ఆ ఆకారం పిచ్చిగాడి తాడి క్రిందకే వచ్చింది.

పిచ్చిగాడు పిచ్చెత్తి పోయాడు. ఉద్రేకం వురకలు తీయగా, వాడిలోని బొమ్మ విభజన చెంది బొమ్మా బొరుసులుగా మారిపోయింది.

బొమ్మ పిచ్చిగాడి కోపం, ద్వేషం వుద్వేగాల పొరల మాటున మరుగున పడిపోయి బొరుసు పైకి తేలింది.

మునసబుకి తనేం చెడుచేసాడు. ఆనవాయితీ తప్పకుండా మునసబుకి ముడుపులు చెల్లించుకుంటూనే వున్నాడు. చివరికి తన భార్యను బలాత్కారం చేయడానికి కూడ వెనుదీయలేదు మునసబు. పిచ్చిగాడి హృదయంలో కోపం నిప్పుసెగలు కక్కింది.

పిచ్చిగాడి చేతులు వణికినై: చేతిలోని కల్లు కత్తి జారింది.

మరుక్షణంలో పెద్ద అరుపు...తర్వాత శ్మశాన ప్రశాంతత

పిచ్చిగాడికి సగం మతిపోయింది. కంపిత హస్తాలతో, భయగ్రస్తమైన శరీరంతో, కల్లు లుట్టితో దిగాడు క్రిందికి.

అప్పుడే చీకటి పలుచబడి తాటి తోపుల్లోకి వెలుగు రేఖ ప్రవేశించింది. అదే వెలుతురు, తాటిక్రింది రెండు

భాగాలుగా తెగిపడివున్న మనిషి శరీరాన్ని పరిచయం చేసింది... పిచ్చిగాడికి.

పిచ్చిగాడు నిలువునా వణికిపోయాడు. కళ్ళు తిరిగినై. కల్లు కత్తితో వాడిగొంతుమీద బలంకొద్దీ వేటువేసిన ట్లని పించింది. తాళాగ్రాన్నుండి అధః పాతాళానికి జారిపడినట్లు భయంకరానుభూతి...

కారణం.... తను పగతీర్చుకున్నది.... మునసబుపైన కాదు... ఆ శరీరం మునసబుది కానేకాదు. దేముడులాంటి పుండరీకాక్షయ్యది.

౧ ౧ ౧

తాటి తోపుల్లో వుష్పుకాలవ ఒడ్డున పగిలిపోయిన కల్లు లుట్టి, రక్తసిక్తమై మట్టిలో పొర్లుతున్న కల్లు కత్తి, బంధాలతో బాటు, పిచ్చిగాడి శవాన్ని, పుండరీకాక్షయ్య నిర్జీవ శరీరభాగాల్ని మొట్టమొదట చూసినవాడు ఆ దిన కరుడు !

౧ ౧ ౧

—౧౧—

## కుక్క తోక

సూర్యుడు సొమ్మసిల్లిన వేళ...

ప్రకృతి కునుకు తీయబోయే వేళ.

మునిమాపువేళ వీధి తలుపు చప్పుడు విని, అనసూయమ్మ ఎవరా అనుకున్నది.

భర్త రంగనాథం వారంవరకూ రానని చెప్పి మంతెన వారిపాలెం వెళ్లారు.

అప్పుడే ఎందుకు తిరిగి వచ్చారో అనుకుంటూ వెళ్ళి తలుపుతీసి నిశ్చేష్టురాలయింది ఆమె. గుమ్మంలో నిలబడ్డ మనిషినిచూచి... బికారి వెధవ ... కాదు ... లాంటి సుబ్బులు... అసలు పేరు సుబ్బారావు...సుబ్బిగాడు; సుబ్బులు పెద్దయినతర్వాతకూడ స్థిరపడిపోయిన చిన్నప్పటి ముద్దుపేర్లు.

చిన్నప్పుడు సుబ్బారావు అల్లరికి చిలిపి చేష్టలకి, ముద్దొచ్చి, సుబ్బిగాడు సుబ్బులు అని పిలిచినా, పెద్దయిన తర్వాత మొద్దులాంటి మొహాన్నిచూచి అవే ముద్దు పేర్లతో శాపనార్థాలు పెట్టడం పరిపాటయి పోయింది కూడ బంధు ప్రపంచంలో.

సుబ్బారావుని చూడ్డంతో ఆ వికారి రూపంలో సాక్షాత్కరించడం రెండోసారైనా, అనసూయమ్మ కళ్లల్లో నీళ్ళు గిర్రున తిరిగినై.

మసక వెలుతురులో సుబ్బారావు ఆ విషయం గ్రహించలేక పోయాడు.

లోపకి కొస్తూనే సుబ్బారావుకు దుఃఖం పెల్లుబికి రాగా అనసూయమ్మ కాళ్ళపై పడిపోయాడు...

వచ్చే పరితాపాన్ని బలవంతాన బంధించి, కొంగుతో కన్నీరు తుడుచుకొని సుబ్బారావుని పైకి తిసి...

'ఏమిట్రా యిలాగై పోయావ్!' అన్నది లోలోపల హృదయం తరుక్కుపోతుంటే...ఎలాగైనా స్వంత మేనల్లు డాయె... అనసూయమ్మ అన్నకొడుకు ఆ సుబ్బులు...

'ఏం చేస్తానత్తయ్యా...నా అదృష్టం యిలా ఉంది' సుబ్బారావు వేదాంత ధోరణిలో...తను చెడిపోవడానికి బలవత్తరమైన కారణం ముఖ్యంగా 'విధి' అని తేల్చేసాడు...

'ఎక్కడరా ఉండడం... యిప్పుడన్నా కుదురుగా ఉంటున్నావా?'

'అవన్నీ తర్వాత చెప్తాలే అత్తయ్యా!...మామయ్య, పిల్లలు ఏరి?'

అనసూయమ్మ, రంగనాథం వూళ్ళో లేడని చెప్ప డానికి కొంత అంజాయించింది.

'పిల్లలు యిక్కడే ఎక్కడో ఆడుతున్నారు...వాళ్ళకు

బెజవాడలోనే ఉద్యోగం... మామయ్య పాలెం వెళ్లారు ఏదో పని మీద '

'ఎవరికీ కాకుండా పోయినా... నువ్వు మాత్రం ఏమీ అనవుగదటే అత్తయ్య... అందుకే మిమ్మల్ని చూద్దామని వచ్చాను...'

'వెధవ... అన్నీ తెలుసును... తెలిసీ అవ్యక్తం... ఆ ఒక్క బుద్ధిమానితే... నిక్షేపంగా బాగుపడే పోదువు...'

సుబ్బారావు శుభ్రంగా, నిండుగా నవ్వాడు. పిల్లలతో సుబ్బారావు కాలక్షేపం చేస్తుంటే అనసూయమ్మ వంటలో, ఆలోచనలో మునిగిపోయింది.

వంట రోజూ వుండేదే... ప్రత్యేకంగా సుబ్బారావు కోసమేం కాదు... కాని ఆలోచన మాత్రం సుబ్బారావు గురించే...

ఎదురుగ్గా ఎర్రని మంట కాంతులు ముహంమీద చిమ్ముతుంటే ఒక్కసారి సత్యం కళ్ళకు కట్టినట్లుగా మెదిలి మాయమై పోయాడు...

వంట పనులు యాంత్రికంగా చేస్తూ గతాన్ని పునశ్చరణ చేసుకుంటున్నది అనసూయమ్మ...

( ( (

సత్యం!... సత్యన్నారాయణ తన స్వయానా అన్న... సుబ్బులు వాడి సుపుత్రుడు. తనకు మేనల్లుడు.

ఆ రోజుల్లో తన చిన్నతనంలో కనగాలలో ఉండే వాళ్ళు [illegible] తను, తన అక్క అన్నపూర్ణ, మంచంలో

తీసుకుంటున్న తల్లి, ఎన్నడూ రోగం, రొష్టూ ఎరుగని తన తండ్రి... అంతా...

సత్యం చాల దూరాన ఎక్కడో కల్యాణిలో స్టేషన్ మాష్టరు.

కనగాలలో తమది లంకంత కొంప. విశాలమైన లోగిలీ... అదే వూళ్ళో అయి దెకరాల మాగాణి, తాటి తోపులు, మామిడి తోట...

తన తండ్రి సుబ్బయ్య... ఆయన పేరే సత్యం కొడుక్కి పెట్టుకున్నాడు తర్వాత...

తన తండ్రికున్న విగ్రహపుష్టి తప్ప సుబ్బులుకి మరే గుణమూ అబ్బలేదు... ఆయన తాడి అంత మనిషి. మంచి బలంగా వుండేవాడు. తన కింకా జ్ఞాపకం. .ఆయన రెండు వడ్ల బస్తాలను రెండు చేతులతో అవలీలగా తీసికెళ్ళి బండి కెక్కించేవాడు.

స్వంత వ్యవసాయం...సమృద్ధిగా పాడి...రెండు గాడు గేదెలు...మూడు ఒంగోలు ఆవులు వుండేవి కొట్టంలో.... పాలు, పెరుగు తమకు సుష్టుగా సరిపోగా, చాల మందికి పందారం జరిగేది. మళ్ళీ ఆ రోజు లొస్తయ్యా!....ఆ ప్రేమ లున్నయ్యా? ఆ మనుషులున్నారా?.. .కాలంతో బాటు మనుషులూ, మనసులూ మారుతుంటే గడచినరోజులు చర్విత చర్వణం చేసుకొనడం తప్ప ఏముంటుంది! అసలు ఎప్పుడూ గడచిన రోజులే అందంగా కనిపిస్తయ్....మనం చేయని పనుల్ని చేయలేని పనుల్ని వేలెత్తి చూసి మన

కర్తవ్యాన్ని బోధించేది కూడ ఎప్పటి కప్పుడు గడచిన రోజులే..

రాతిలాంటి పెరుగు. తోడుపెట్టిన పెరుగు కదిలిస్తే కదిలేది కాదు. చాకుతో కోయాల్సి వచ్చేది ముక్కలుగా జున్నుగడ్డల్లాగా. వూళ్ళో వాళ్ళందరికీ తన తండ్రంటే ఎన లేని గౌరవం. ఏ సలహాకన్నా, సహాయానికన్నా ఆయన దగ్గరకే వచ్చే వాళ్ళు వూళ్ళో తనంటే ఆయనకు వల్ల మాలిన ప్రేమ

సత్యం అన్నపూర్ణల తర్వాత అయిదుగురు సంతానం కలిగి ఒక్కరూ బ్రతికి బట్టకట్టలేదు. తర్వాత తను. అందుకే తనంటే గారాబం చేసేవాడు ఆయన. అనసూయమ్మ నేత్రాలు బాల్య స్మృతులతో తళుక్కుమన్నై.

సత్యానికి తండ్రి పోలికే వచ్చింది. తండ్రిలాగే బలి ష్టుడు, మంచి పట్టుదల గల మనిషి ..ముక్కుకు సూటిగా పోయేరకం అటువంటి వాడికి దేవతలాంటి భార్యే దొరి కింది. ఎంతో సౌమ్యురాలు. కాని ఆమె తనయింటి కోడ లిగా వున్న అయిదేళ్ళలో తనకు చిహ్నంగా, ప్రతిరూపంగా ఒక ఆడ పిల్లను వదలి శాశ్వతంగా కనుమరుగై పోయింది. తను దేవతలాంటి వదినగార్ని చూడలేదు - ని, ఆమె మిగిల్చి పోయిన ఆ పసిబిడ్డతోనే పెరిగింది చిన్నప్పటినుండి. తర్వాత సత్యం కల్యాశిలో వుంటే, పిల్ల తమతోనే వుండేది. దాని పేరు లక్ష్మి. లక్ష్మి, తను ఒక కంచంలో తిని,ఒక మంచంలో పడుకొని; అక్క చెల్లెళ్ళలాగా పెరిగారు. లక్ష్మి తన

యీాడుదే.. తనంటే ఎంతో ప్రాణం దానికి. అది యిప్పుడు హాయిగా తన సంసారం తను పోరు పొచ్చం లేకుండా చక్క దిద్దు కుంటున్నది.

వదినలో మంచితనాన్ని గుర్తించి అన్నయ్యకు ఆమె పోవడంతో మానసికంగా గట్టి అఘాతమే తగిలింది. అయినా అందరి బలవంతంపల్ల మారు మనువుకు ఒప్పుకోక తప్పింది కాదు వాడికి

రెండో వదిన రాజేశ్వరి. మొదటి ఆవిడకు, యీామెకు సామ్యం ఏ మాత్రం లేదు. పూర్తి వ్యతిరేకం. సత్యం కాద న్నది తను అవునని, వాడు చెయ్యమన్నది తను ససేమిరా చెయ్యనని, పూర్తిగా రెట్టమతం..., అంతా చండిక శాస్త్రం.

అంత ప్రయాసపడి సెలవుబెట్టి కల్యాణినుండి కనగాల వచ్చేవారు. రెండురోజుల్లో యిద్దరికీ ఏదో కీచులాట రావడం, సాయంత్రంకల్లా ప్రయాణమై వెళ్ళిపోవడం కూడ జరిగిపోయేది వచ్చినంతసేపు పట్టేదికాదు. మంచంలో ముసి లావిడ వీరి దాంపత్యాభాస చూచి కన్నీరు పెట్టుకుని కుమిలిపోయేది.

సంవత్సరంలో తొమ్మిది నెలలు, ఆవిడగారు పుట్టింటి కెళ్తే .. అక్కడ కల్యాణిలో సత్యం పాక శాస్త్రంలో తర్ఫీదు పొందేవాడు

తన తండ్రి ఒక రోజు పొలంనుండి వస్తుంటే, దారి లోనే విపరీతమైన వాన వచ్చింది. ప్రక్కనే పెద్దగుంట

వుంటే, దిగి, తడవకుండా, అలా గట్టుప్రక్కనే నిలబడ్డాడట. వానకి గట్టు తెగి, పెద్ద పెళ్ళ వూడి ఆయనమీద పడడం, పక్షవాతం రావడం జరిగింది. వూరిరైతులు అటువైపుగా వస్తూ చూసి 'అయ్యో సుబ్బయ్య పంతులుగారా' అని యింటికి తీసుకుని, సంవత్సరం తిరక్కుండానే చెట్టంత మనిషి గల్లంతు కావడం జరిగింది. యిహ మంచంలో తల్లి మంచం లోనే మిగిలింది మంచంలో రోగంతో బాధ పడ్తూనే, తనదీ తన అక్క అన్నపూర్ణదీ పెళ్ళిళ్ళు చేసింది.

రాజేశ్వరిది, సత్యానిది, దారి ఎన్నడూ కలిసేది కాదు. ఎడ్డెమంటే తెడ్డెం. ఎప్పుడూ ఏదో రభస జరుగా ల్సిందే. మొదట ఆవిడ సౌమ్యురాలు కాబట్టి వీధి కెక్క కుండా సంసారం చేసింది కాని, రాజేశ్వరమ్మ మొండితనం వల్ల సత్యం కూడ పేట్రేగి పోయేవాడు చేతిలో ఏది వుంటే దానితో కొట్టేవాడు. రాజేశ్వరికి మొదట సంతానం ఆడ పిల్ల ... తర్వాత సుబ్బులు...రంగడు. .ఆడపిల్ల సావిత్రి సౌమ్యు రాలు. దానిక్కీ పెళ్ళయి దాని సంసారం అది గుట్టుగా వెళ్ళ దీసుకుంటున్నది. యిహ సుబ్బులు రంగడు యిద్దరూ తల్లి తర్ఫీదులో పెరిగారు. కావాలని చెడ్డపనులు నేర్పుతుంటే అది పెంపకం ఎలా అవుతుంది. పెంపకం కంటే దానిని తర్ఫీదు అనాలి. ఆవిడగారు సంవత్సరంలో తొమ్మిది నెలలు పుట్టింట్లో వుండడంతో పిల్లల చదువు సవ్యంగా సాగేది కాదు. వానాకాలం చదువే అయింది. చదువు రాకపోయినా సరే. వాళ్ళనిమాత్రం సత్యందగ్గర వుంచక, తనతో పే

వాళ్ళని యిటూ అటూ ఆసులో గొట్టంలా తిప్పుతుండేది. చివరికి వాళ్ళిద్దర్నీ వాడికి కాకుండా చేసింది.

రాజేశ్వరి మొండితనానికి గుర్తుగా ఒక సంఘటన తనకింకా బాగా జ్ఞాపకం ఉన్నది. మరి పెద్ద పెద్ద విషయాలేవీ కావు.

అసలు వచ్చినదల్లా వంటకాలలో పప్పు పులుసుదగ్గర వచ్చింది. సత్యం, కందిపప్పు వేసి పులుసు పెట్టమన్నాడు. 'ఏం, పెసరపప్పు అయితే దిగదా ఏం?!' అన్నదామె పిల్లల్ని కసిరినట్టు.

సత్యం, 'మాట్లాడకుండా చెప్పినట్లు చేయ'మన్నాడు. తర్వాత బజారు వెళ్ళి మధ్యాహ్నానికి తిరిగి వచ్చాడు. ఎండలో తిరిగి నకనకలాడుతున్నాడేమో, చికాకుగా వున్నాడు.

భోజనానికి కూర్చున్నాడు. ప్రక్కనే కుంపటిమీద పులుసు మరుగుతున్నది. సత్యం భోజనం చేస్తూ పులుసు పెసర పప్పుదని గ్రహించాడు. రాజేశ్వరమ్మ, వాడు ఏది వద్దన్నాడో అదే చేసింది పెడసరంగా. సత్యం రౌద్రందాల్చాడు. పక్కనేవున్న యినుపగరిటె విసిరివేసాడు ఆమె మీదికి. ఇంకా కోపం ఆగక, పక్కనే కుంపటిపైన మరుగుతున్న పులుసు తీసి కెళ్ళి సలసలా కాగేది కాస్త ఆమె నెత్తిమీద కుమ్మరించాడు. ఆమె లబో దిబో. సత్యం ఖరాఖండీ మనిషి. తను వున్నట్లు అందర్నీ ఉండమంటాడు తన అన్నగారు చేసిన మరో పని జ్ఞాపకం వచ్చేప్పటికి అనసూయమ్మ లోలోపలే నవ్వుకొన్నది.

ఎందుకో తనూ వాళ్ళింట్లోనే ఉండడం తటస్థ పడ్డది. సెలవల్లో వాడు బెజవాడ వచ్చాడు. అలసీ సొలసీ తొమ్మిదింటికి యింటికి జేరి భోజనం చేసి పడుకున్నాడు ఆరు బయట. సత్యం అప్పుడే... వీధి అంతా నిశ్శబ్దంగా వున్నది గాని, ప్రక్క యింట్లోనుండి మాత్రం ఒకటే మాటలు, గల్లంతు. వాటితో బాటు నవ్వులు, అరుపులు. వారిం టికి ఎవరో చుట్టాలు వచ్చారుట. అదీ హడావుడి. అర్ధరాత్రి పన్నెండు కావస్తున్నది కాని ఆ గోలకూ హద్దూ పద్దూ, ఆపడం లేకుండా పోయింది. గోలకు వీడికి నిద్ర రాక కంపర మెత్తింది. చూసి చూసి చివరికి మధ్య గోడదగ్గర కెళ్ళి ఆ యింటి ఆసామిని కేకేసాడు. వారింటికీ వీరింటికీ మధ్య భుజాలవరకూ వచ్చే సిమెంటు రాళ్ళగోడ వున్నది. ఆయన వచ్చాడు.

సత్యం, కాస్త మాటలు తగ్గించమని మామూలుగా చెప్పాడు. అసలే సత్యం అంటే అందరికీ అదో రకమైన చుల కన. .లొంగుసాను.

ముక్కుకు సూటిగా పోయే మనుషుల్ని చూస్తే అంద రికీ అంతేనేమో? "మా యింట్లో మేమేదైనా చేస్తాం. మీ రెవరండీ మధ్య.." అనటాని అనేశారు మొహం మీదే.

వీడు యిహ వంటింట్లోకి వెళ్ళి ఒక ఖాళీ కిరస నాయలు డబ్బా. ఒక అప్పడాలకర్ర తీసుకుని గోడవారగా నిలబడి రణభేరి ప్రయోగించడం మొదలు పెట్టాడు.

కర్ణకఠోరమైన ఆ డప్పుకు తట్టుకోలేక ప్రక్క యింటి వారంతా పాలోమంటూ గోడదగ్గర మూగేశారు.

'ఏమిటయ్యా యిది ?'' అంటే...

'ముందు నోరు ముయ్యవయ్యా' అని 'అడగడానికి నువ్వెవరి వయ్యా...నా యింట్లో నేనేం చేస్తే నీకేం...మీ గొడవ మీరు చూచుకోండి' అని కసిరి పంపేశాడు.

ఆ యింట్లో ఆ రాత్రికాదు కదా...వాడు బెజవాడ నుండి కల్యాణికి తిరిగి వెళ్ళేవరకూ రాత్రిపూట సంతృప్తిగా నోరెత్తి మాట్లాడితే ఒట్టు.

మర్నాడు ఆ బజారు బజారు, సత్యాన్ని 'జూ' లో జంతువును చూ సట్లు వింతగా చూడ్డమేట. వెనుకనుండి సకిలింతలు. ఎవరో వెనుకనుండి 'డబ్బారాయుడు' అని పొలికేక కూడా పెట్టారట. అది సత్యమే చెప్పి గొప్పగా నవ్వుకున్నాడు. చిన్నప్పుడు ముద్దుగా గారాబంగా పెరిగిన సుబ్బులు, సత్యం చెప్పినమాట వినక తల్లి ప్రాపకంలో అల్లరి చిల్లరగా తిరిగాడు. చిల్లరడబ్బులు లేకపోతే సత్యం జేబులోనుండి సుబ్బులుచేత దొంగతనంగా డబ్బులు తీయిస్తుండేది, సత్యం కనుమరుగైనప్పుడల్లా

చివరికి చిన్న చిన్న దొంగతనాలు కాస్తా ముదిరి పాకానికి వచ్చినై.

ఎలాగైతేనేం సుబ్బులు చేయి వాటుతనంలో తర్ఫీదు తల్లి రాజేశ్వరమ్మ యిచ్చింది. బంధు ప్రపంచంలో సుబ్బులు

పేరు 'దొంగ చచ్చినాడు'గా స్థిరపడిపోయింది. వాడంటే అందరికీ భయం. వాడెవరింటికైనా వెళ్తే వరండాలోనే కూర్చోబెట్టి మర్యాద చేస్తారు. మొహమాటం కొద్దీ లోపలికి రానిచ్చినా వాళ్ళ కళ్ళన్నీ వీడిమీదే వుంటయ్; వీడు వదలి వెళ్ళే వరకూ.

ఎందుకోగాని అంత గట్టి మనిషి సత్యం కొడుకుపల్ని, పెళ్లాన్ని అదుపులోకి తేలేకపోయాడు. రోజులు గడుస్తున్న కొద్దీ సుబ్బులు చదువు సన్నగిల్లి దొంగతనంలో ఆరి తేరాడు.

ఆ రోజు తనకు బాగా గుర్తున్నది. లక్ష్మి పెళ్ళి... తన తల్లే స్వయంగా చేయించింది కనగాలలోనే... అందరూ వచ్చారు. పెళ్ళి సలక్షణంగా జరిగింది ఆ రోజు అన్నపూర్ణ రెండు జతల బంగారు గాజులు తీసి బీరువాలో పెట్టి ఏదో పనిమీద దొడ్లోకి వెళ్ళింది. పనీ పాట పూర్తయి తిరిగ్గా వచ్చి బీరువా; తెరిచేటప్పటికి గాజులు గల్లంతు. వాటితో బాటు సుబ్బులు కూడ గల్లంతే. ఆ రాత్రంతా ఎక్కడో తిరిగి, మర్నాటి మధ్యాహ్ననికి యింటికి చేరాడు. నానా గొడవ జరిగింది. సత్యం యిష్టం వచ్చినట్లు చితక తన్నాడు.

చివరికి సుబ్బులు ఎలాగో ఒప్పుకున్నాడు.

ఒక్క రాత్రిలో గాజులు అమ్మడం, డబ్బు హరించుకుపోవడం కూడా జరిగింది. వారం తిరగకుండానే అన్నపూర్ణకి గాజులు చేయించి యిచ్చాడు సత్యం. అంత నిజాయితీ మనిషి వాడు.

అయినా సుబ్బులు మాత్రం ఆ బుద్ధి మానలేదు. చదువు ఘోర్తుఘారంతో ఆగిపోయింది. పాడుబుద్ధులు అబ్బి నంత వేగంగా చదువెలా అబ్బుతుంది!

బెజవాడకు దగ్గరగా వుంటుందని గంగినేనికి బదిలీ చేయించుకున్నాడు సత్యం. వాణ్ణి చూడడానికి ఎవరో పాత స్నేహితుడు నైవేలినుండి వచ్చాడు ఒకసారి, పిల్లా జల్లాతో సహా నైవేలిలో యింట్లో ఎవరూ లేరని సుబ్బులు పసిగట్టి భోజనాలప్పుడు ఆ స్నేహితుని కోటుజేబులోని తాళం చెవుల గుత్తి కొట్టేశాడు.

వాడికి రైలు ప్రయాణం ప్రయాస, ఖర్చులేని హాబీ. టి. సి. కళ్ళు కప్పడంలో అందెవేసిన చెయ్యి. ఇంజన్‌లో బొగ్గు వేస్తానంటే డ్రైవర్ వాడి రొట్టె పెట్టి మరీ తనతో తీసికెళ్తాడట. యిలాంటి సులువులు చాలా తెలుసును వాడికి.

నైవేలిచేరి ఆ పెద్ద మనిషి యింటి సామానంతా పరమేశ్వరార్పణం చేసాడు.

ఆ స్నేహితుడు జేబు తడుముకొంటే తాళపు చెవుల గుత్తిలేదు. చీకటి పడినా సుబ్బులులేడు. తాళాల గల్లంతు', సుబ్బులు రాకపోవడానికి గల అవినాభావ సంబంధం గుర్తిం చారు యింటిల్లిపాది. సత్యానికి, రాజేశ్వరికి పోట్లాట జరి గింది కూడ ఆ విషయంలో. సత్యం పూనుకోలేదు. పోలీసు రిపోర్టు యిచ్చారు. సుబ్బుల్ని పట్టుకున్నా, సామాను లేదు సరికదా వాటి తాలూకు డబ్బు కూడ దొరకలేదు. సత్యం

స్నేహితుని ధర్మమా అని సుబ్బులుకి శిక్ష ఏమీ పడలేదు.

తర్వాత కొన్నాళ్లు సుబ్బుల్ని సత్యం ఇంటికి రానియ్యలేదు. అయినా సత్యం యింట్లో లేని వేళల్లో తల్లి దగ్గరకు వచ్చి వెళ్ళేవాడు సుబ్బులు.

మొదటినుండీ సుబ్బులు పనులకు ప్రోత్సాహం యిస్తూ వచ్చినదే ఆమె. చిన్న దొంగతనాలు వదలి పెద్ద వాటిలోకి దిగినా, సుబ్బులి పనులను గర్హించడం మాని, పోలీసు రిపోర్టు యిచ్చినందుకు సత్యాన్ని నానా మాటలు అన్న దామె.

ఆమె పోరు పడలేకనే యిహ నుండైనా కుదురుగా వుండేట్లయితే యింటికి జేరనిస్తా నన్నాడు సత్యం. ఆ పద్ధతి మీాదే సుబ్బులు మరల గృహప్రవేశం చేసాడు.

కొన్నాళ్ళు ఎట్టి మారామ్మళ్ళు లేకుండా గడచి పోయినై. సత్యం సావిత్రి పెళ్ళిచేసాడు.

పెళ్ళి హడావుడి, మేళతాళాలు, సుబ్బులి నిద్రాణ మైన శక్తిని మరల ప్రేరేపించినై. తిరిగి బుద్ధావతారంలో నుండి అసలు సుబ్బావతారం బయటపడింది. సావిత్రికి పెళ్ళికి చేయించిన వేయిరూపాయల రాళ్ళ నెక్లేసు మఖమల్ పరుపు పెట్టెతో సహా మాయమైంది. అంటే పెట్టె ఒక్కటే మాయమయిందనా? కర్త అయిన సుబ్బారావు కూడ అంజనం రాసుకుని అదృశ్యమైనట్లు మాయ మయ్యాడు. వాడయితే అనకాలగానే కొట్టేశా గాని, వాడు మటు మాయమైన తర్వాత పెళ్ళిలో జరిగిన గలాభా, సత్యం

తొక్కిన చిందులు, రాజేశ్వరిని చెడామడా తిట్టడం, కొట్టడం ... అబ్బ... చెప్పనలవికాని రాద్ధాంతం.

తిని కూర్చుంటే, రాసులే తరిగి పోతుంటై. నెక్లెస్ వేయి రూపాయలను ఆరు నెలలు తిరక్కుండానే, అగస్త్యు డిలా ఫుక్కిలించి పారేశాడు సుబ్బారావు.

మరల రాజీ మొదలు..రాజీకి రాజ్యేశరి పోరు నాంది అన్న మాట.

సత్యం ఎంత కరకో అంతా మార్దవం కలవాడు. కాళ్ళా వేళ్లాపడితే కరిగిపోతాడు. ఎంత పట్టుగా వుండా మనుకున్నా వుండలేకపోయాడు సత్యం యీ సారి కూడ. సుబ్బులు తల్లి అండన జేరాడు. కాని యీసారి సుబ్బులుకి, సత్యానికి చాలావరకు ముభావంగా గడచినదనే చెప్పాలి.

సుబ్బారావు జాతక మదేమోగాని, ఏదో అదృశ్య శక్తి వాడి చోరకళ అభివృద్ధికై ఏవో క్రొత్త క్రొత్త అవ కాశాలను సృష్టిస్తూనే ఉంది. సుబ్బారావు అలా అనుకో కుండా అందిన అవకాశాలను సునాయాసంగా, 'సొమ్ము' చేసుకుంటూనే ఉన్నాడు.

సత్యం రిటైర్ కావడం సుబ్బారావుకు జీవితంలో లభించిన చాల అవకాశాలలో ఒకటి.

సత్యానికి ప్రభుత్వం వారిచ్చిన కొంత సొమ్ము నాలుగు వేల పై చిలుకు వచ్చింది. ఎప్పటికప్పుడు సుబ్బులు బుద్ధి చెప్తూనే ఉన్నా సుబ్బులుమీాద అంత నమ్మకం ఎలా కుదిరిందోగాని సత్యం డబ్బు, పెట్టెలో పెట్టాడు. అందులో

సగం చిన్నప్పుడు, చిల్లర డబ్బులు కొట్టేసినంత తేలికగానూ కొట్టేసి మరి తిరిగి చూడకుండా, జాడ లేకుండా వెళ్ళి పోయాడు సుబ్బులు...

యింత పెద్ద మొత్తం పోయేసరికి సత్యం వెర్రెత్తి పోయాడు. కాని సుబ్బులు అజా పజా వుంటేగా?...తర్వాత వాడ్ని యింటికి రానీయ కూడదని దృఢంగా నిశ్చయించు కున్నాడు సత్యం.

రెండు వేల సొమ్ముతో పారిపోయిన సుబ్బులు, పుట్టిన తరువాత ఒక్క మంచిపనికూడ చేయని సుబ్బులు, పుట్టిన దాది తోటకూర దొంగతనం మొదలుకొని అంచెలంచెలుగా, ఆ కళలో అగ్ర తాంబూలం స్వీకరించిన సుబ్బులు, రెండు వేలదొంగతనం తర్వాత ఒక మంచిపని చేసాడు.

ఒక ఆడకూతురి తండ్రికి పెళ్ళి తంటాలు లేకుండా ప్రేమించి, పెళ్ళి చేసుకున్నాడట. పెళ్ళి చేసుకొనిన తరువాత ఆ రెండు వేలు హరించుకుపోయే తరుణంలో సత్యానికి యస్. ఓ. యస్ మెసేజ్ ఒకటి పారేశాడు. సత్యం కిమి న్నాస్తి.

యిహ ఎలాంటి సంబంధమూ వాడితో పెట్టుకోకూడదని గట్టిగా నిర్ణయించుకోవడమే దానికి కారణం.

యీ రాజేశ్వరమ్మ మధ్యవర్తిత్వానికి కూడా పటుత్వం తగ్గి యింది

అటు తరువాత సుబ్బులు జాడ బంధుప్రపంచానికి కొన్నాళ్ళ వరకూ తెలియలేదు. కొన్ని సంవత్సరాల అజ్ఞాత

వాసం తర్వాత అకస్మాత్తుగా యించుమించు బికారిరూపంలో రంగనాథం, అనసూయమ్మల గృహాన్ని పావనం చేసాడు సుబ్బులు.

... — ...

రెండువేల రూపాయలను స్వాహా చేసి ధనార్జన లేని సుబ్బారావుకి, దయతో ప్రేమభిక్ష పెట్టి ఒక బీదకన్నె కన్నెచెర విడగొట్టిన సుబ్బులుకి, గృహస్థుడై యిద్దరు, నలుగురైన సుబ్బులుకి, కుటుంబం గడవడం కష్టంగా వుందిట.

రెండువేల నిషాలో మత్తుగా పడివున్న అత్తమామలు నిషా వదలడంతో, సుబ్బారావుతో రభస మొదలెట్టారు. సుబ్బారావుకి ఉద్యోగం కావాలి ప్రస్తుతం సుబ్బారావు సమస్య యిది.

యిక పాత బుద్ధులకు మంగళం పాడేశానని, యిక కుదురుగా వుంటానని, ఎన్నో వాగ్దానాలు కురిపించాడు సుబ్బులు. అనసూయమ్మ సంబరానికి అంతూ పొంతూ లేదు; కొన్ని సంవత్సరాల తరబడి చెడిపోయినవాళ్ళ, అప్రయోజకుల లెక్కలోనున్న సుబ్బులు, అదీ తన మేనల్లుడు యిన్నాళ్టికి తనవల్ల బాగు పడబోతున్నందుకు.

సుబ్బారావు వుద్యోగానికి రంగనాథం ప్రయత్నాల మీద ప్రయత్నాలు చేస్తున్నాడు. అందుల్లో అనసూయమ్మ శ్రద్ధ ఎక్కువైంది.

పెళ్ళాం, పిల్లల్ని తీసుకు రావడానికి, అక్కడ

సుబ్బులు చేసిన కొన్ని చిల్లర అప్పులు తీర్చడానికి (సుబ్బులు ఉవాచ). రెండు వందల రూపాయలు కూడ యివ్వాల్సి వచ్చింది రంగనాథంగారికి. 'ఉద్యోగం దొరికితే వెంటనే కాస్త కాస్త చొప్పునయినా తీరుస్తాడులెండి. మన ఋణం ఏమీ వుంచుకోడు వాడు.' అన్నది అనసూయమ్మ రంగనాథం గారితో.

'తీర్చకపోయినా సరే, వాడు నిలకడగా వుంటే అంతే చాలు' అని కూడ సరి దిద్దుకున్నది ఆమె ఒక వేళ సుబ్బులు తీరుస్తాడో లేదో అనే అనుమానంతో. మూడో నాటికి అంతా దిగారు. సుబ్బులు పెళ్ళాం సంసార పక్షంగానే వుంది. అనాకారేం కాదు యిద్దరూ మొగపిల్లలే ఒకడు ఆరేళ్లవాడు. యింకొకడు నాలుగేళ్లవాడు. అనసూయమ్మ సంతోషంలో రంగనాథంగారికి ఎన్నో పురమాయించింది అందరికీ కొత్త బట్టలు కట్టించి, పిండివంటలుచేసి, ఎన్నో మర్యాదలు చేసింది యీ సంగతి సత్యానికి తెలియకుండా గుప్తంగా వుంచి, ఒక్కసారే తెలిసేలా చేసి ఆశ్చర్యంలో ముంచి వేయాలని ఆవిడ వుద్దేశ్యం.

౽ ౽ ౽

ఎలాగైతేనేం, సుబ్బులు గ్రహబలమో, రంగనాథం ప్రయత్నబలమో కాని, పక్షం తిరగకుండా తెనాలిలో రంగనాథం తెలిసినవారి ఫర్మ్‌లో సుబ్బులుకి గుమాస్తాగిరీ లభించింది.

అనసూయమ్మ ఆనందం అర్ణవమే అవగా, ఆమె ఆనందార్ణవ తరంగాల ఘాటికి సుబ్బులు, పిల్లలూ, మిసెస్ సుబ్బులు వుక్కిరిబిక్కిరయ్యారు. కొంత డబ్బుతో, కొత్త ఉడుపులతో సంసారారంభానికి కొంత చెంబూ, తప్పాలా సామగ్రితో తెనాలి సాగనంపింది వారిని.

( ( (

సుబ్బులు దొంగతనం ప్రధాన వృత్తిగా వదలి, లోకుల దృష్టిలో దొంతనంలాంటి గుమాస్తాగిరీ చేపట్టాడు.

ఆనందంతో బాటు ఆత్రంకూడ, ఎక్కువైంది అనసూయమ్మకు యీ విషయం సత్యానికి తెలిస్తే ఎంత సంతోషిస్తాడో కదా అని...

కాని ఎందుకో సత్యానికి ఆ విషయం తెలియకుండానే మూడు నెలలు గడచిపోయినై. పండగముందు రోజులు సంవత్సరాది రెండురోజులు వున్నది యింకా.

( ( (

'పాపం సుబ్బులు వాళ్ళని తీసుకుని రండి యిక్కడికి. ఒక్కళ్లే బిక్కుబిక్కుమంటూ ఎలా వుంటారు – ఒక సరదా, సంతోషం లేకుండా...నాలుగు రోజులుండి వెళ్తారు' అని రంగనాథాన్ని తెనాలి పంపింది ఆమె. బెజవాడనుండి వాసు కూడ వచ్చాడు. తెల్లవారితే పండుగ. ప్రొద్దుననగా తేనాలి వెళ్ళాడు రంగనాథం. సాయంత్రం అయింది ఆయన

రాకకోసం వేయికళ్ళతో నిరీక్షిస్తున్నది అనసూయమ్మ. వాళ్ళు రావాలి... యిల్లంతా సందడి.

సుబ్బులు కళ్ళలో కృతజ్ఞతా పూర్వకమైన చూపులు. తనంటే వాడికి ఎప్పుడూ అభిమానమే. పాపం వాడికి చిన్నప్పటి నుండీ జగచాట్లే. పెంపకం బాగోలేకగానీ, తనదగ్గరే గనుక వుంటే మెరికలాంటి వాడ్ని చేసేది' అనుకుంటున్నది ఆమె ఆ ఆలోచనల్లో.

౨ ౨ ౨

సూరీడు ఎడా తెరిపీ లేని ప్రయాణంలో నీరసించి, అలసి కుంకుమలలో విశ్రాంతికై వాలిగిపోతుంటే, రైలు ప్రయాణంలో రంగనాథం అలసిసొలసి కాళ్ళు చేతులు కడుక్కుంటూ, ఉత్తరీయం దులిపి భుజాన వేసుకుంటూ గుమ్మంలో అడుగు పెట్టారు.

"అరుగో రానేవచ్చారు, యిప్పుడే అనుకుంటున్నా... మీ అందరికీ నూరేళ్ళ ఆయుస్సర్రా...అనుకొంటుండగానే వచ్చారు..."

'... ... ...'

"అరె...ఏరండీ సుబ్బులు వాళ్ళు ?"

'... ... ...'

'మాట్లాడరే... బెజవాడగానీ వెళ్ళలేదు గదా'

'ముందు కాసిని చల్లటి నీళ్ళియ్యి...గొంతు ఆర్చుకుపోతున్నది. తర్వాత తీరిగ్గా చెప్తా...'

'అబ్బ! చెప్పరాదుటండీ మంచి నీళ్ళిస్తా గాని, మీరు చెప్పండి.' అంటూనే ఆమె కంచు చెంబుతో చల్లటి నీళ్లు తెచ్చి యిచ్చింది.

గటగటా త్రాగి, వుత్తరీయంతో స్వేద బిందువులు తుడుచుకుంటూ...

'మేనల్లుడు బుద్ధావతారాన్ని చాలించి, తన పూర్వాశ్రమం స్వీకరించాడు' అన్నారు నవ్వు తెచ్చుకుంటూ.

'అబ్బ...మీ హాస్యం చాలించి వివరంగా చెబ్దురూ... యిక్కడ ఒకవైపు జనం ఆత్రంతో యిదవుతున్నా మీ హాస్యంమాత్రం మానరు!'

'ఏముంది, యింటికి వెళ్తే యిల్లుగలవాళ్ళు, తాళం వేసి 'అద్దెకు యివ్వబడును' బోర్డు పెట్టారు వీళ్ళున్న భాగానికి. తీరా యిల్లు మారారేమోనని అడిగి చూద్దునుగదా అసలు సంగతి బయట పడింది.

ఒకరోజు ప్రొద్దున పగలు పదిగంటలయినా యింట్లో పిల్లలు, సందడి లేకపోగా యింటివాళ్లు యిటు తొంగి చూచారుట. ఏముంది. తలుపులు బార్లా తెరచివున్నై. వాళ్ళు ఒకచే గోల.

ఆఫీసులో పండుగ అడ్వాన్సు తీసికొని తోటి గుమాస్తాల దగ్గర తలా పదీ పరకా అప్పులు చేసి, సామానుతో సహా, యింటి అద్దె ఎగవేసి రాత్రికి రాత్రి పరారి అయ్యాడుట సుబ్బులు.

ప్రస్తుతం వాడు ఏ సీమలో వున్నాడో, ఏ అవతారం దాల్చాడో ఆ పెరుమాళ్ళుకే ఎరుక. యిదీ మేనల్లుడి నిర్వాకం. మీ అన్నయ్యకు గొప్పగా చెప్పావుకాదు. యిప్పుడు చివాట్లు తినాల్సి వచ్చేది...నవ్వులపాలు అయే వాళ్ళం...అయినా...'

యింకా ఏదో చెప్పుకుపోతున్న రంగనాథాన్ని గుడ్లప్పగించి చూస్తూ స్థాణువులా నిలబడిపోయింది అనసూయమ్మ...

⊙⊙⊙⊙
⊙⊙⊙

## గాలిలో గడ్డిపరకలు

రైలుబండి చ్రుయన ముందుకు దూసుకొని పోతోంది. . చల్లని గాలి జివ్వున లోనికి వచ్చి చక్కిలిగింతలు పెట్తోంది.

హృదయం మధురభావాల మృదుల స్పర్శతో పుల కించి పరవశమౌతోంది.

అంబరాన్ని చుంబించే గిరిశిఖరాలు — ఎత్తుగా, ఏపుగా పెరిగి, విశాలంగా వ్యాపించుకొని పచ్చగా కళకళలాడే చెట్లు, పొదలూ...

గమ్యస్థానం సమీపిస్తున్నకొద్దీ నా హృదయంలో ఏదో ఆత్రం పెల్లుబికి వస్తోంది. .

మూర్తిగారి గురించి నాన్నగారు చెప్పినపుడు వినడమే గాని, ఆయనను యింతవరకు ముఖాముఖి చూడలేదు నేను. నాన్నగారు, మూర్తిగారు ప్రాణస్నేహితులట

మూర్తిగారు జీవితంలో చాల కష్టాలు పడ్డవాడనీ, ఏదో అనుకోని సంఘటనతో ఆయన మనసు చలించిపోయి దేశాలు తిరిగి వచ్చారనీ, యిప్పుడు తను వెళ్ళబోయే ఊరికి

దగ్గరగా ఒక ప్రశాంత ప్రదేశంలో చిన్న యిల్లు కట్టుకొని, తత్వ చింతనతో కాలంగడుపుచున్నారనీ, నాన్నగారు చెప్పారు. నాన్నగారు అప్పుడప్పుడూ ఆయనదగ్గరకు వెళ్ళి వస్తూనే ఉంటారు.

ఆయనకు అడపా దడపా ఆర్థికంగా కూడా సహాయం చేస్తుంటా ని నాకు చూచాయగా తెలుసు. వారి వారి స్నేహం అలాంటిదట నన్ను నా చిన్నప్పుడెప్పుడో చూచారట. నేనంటే అమితమైన వాత్సల్యం చూపించే వారని, అమ్మకూడ అంటూ ఉంటుంది.

అకస్మాత్తుగా ఆయన దగ్గరనుండి కబురు వచ్చింది నిన్న. ఆయనకు ఆరోగ్యం బాగోలేదుట. చిన్నప్పుడెప్పుడో చూసిన నన్ను ఒకసారి చూడాలని ఉన్నదట. రమ్మన్నారు మమ్మల్ని అందరిన్ని. నాన్నగారికి ఏదో అత్యవసరమైన పని అడ్డు వచ్చింది. అమ్మా, నాన్నగారూ రేపు వస్తామన్నారు. నేను బయలు దేరాను ఆయన దగ్గరకు. ఎంతో ఆత్రుతగా ఉన్నది. నాన్నగారి ప్రాణస్నేహితుడిని, నన్ను అమితంగా ప్రేమించేవారిని కలుసుకో బోతున్నానని. ఒకవిధంగా నా అదృష్టమే అని చెప్పాలి. కాలేజీలకు సెలవలు కాబట్టి సరి పోయింది. లేకపోతే యిప్పుడు కూడ వారిని చూచే భాగ్యం నాకు తటస్థ పడకపోను.

అప్పుడప్పుడూ నాన్నగారికి ఉత్తరాలు వస్తూ ఉంటయ్. వాటిద్వారా నాకు వారి అమృతాశీస్సులు హృదయ పూర్వకంగా పంపేవారు.

క్రితం సంవత్సరం యం. ఏ. ఆనర్స్ యూనివర్సిటీ ఫస్టున డిస్టిన్‌క్షన్‌తో ప్యాసయినానని తెలిసి ఆయన పొందిన అనుభూతుల్ని, సంతోషాన్ని, ఉత్తరం ద్వారా ఎలా వ్యక్తం చేసారో ఈ నాటికీ నాకు బాగా జ్ఞాపకమున్నది. ఇప్పుడు నేను వృద్ధిలోకి వచ్చి, లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తూ, నా జీవితాన్ని వడ్డించిన విస్తరిలాగా చేసుకొన్నానంటే, అదంతా ఆ అజ్ఞాతమూర్తి అమృతమైన దీవెనల చలవేనని ఎందుకో నా మనస్సు పదే పదే చెప్తున్నది. నా మనస్సులో అలాంటి అత్యున్నత గౌరవస్థానానికి అర్హుడైన ఆ మూర్తి గార్ని మొదటిసారి చూడడానికి వెళ్తున్నాను.

నేను దిగాల్సిన స్టేషనొచ్చింది బండి ఆగింది స్టేషను చాల చిన్నది. స్టేషనుకు ఒకవైపున సూటింగా చిన్న ఊరు సుందర ప్రకృతి దృశ్యాలతో కన్నుల పండువుగా ఉంది.

మరియొక వైపున పెద్దకాలవ. దానికి రెండువైపులా వింత వింత చెట్లూ. కొన్ని చెట్లు రంగు రంగుల పుష్పాలతో శోభాయమానంగా ఉన్నై. చుట్టూరా దగ్గరలో ఎత్తయిన పచ్చని కొండలు. దూరంగా కాలువ వడ్డున పర్ణశాల. అదే మూర్తిగారి ఇల్లు.

కాలవ ఒడ్డున నిర్జన ప్రదేశంలో. ప్రశాంత వాతావరణంలో, ప్రకృతి మాతతో సెయ్యం చేయగలిగే వారు మూర్తిగారు తప్ప యింకొకరై ఉండరు మరి-

నాన్నగారు చెప్పిన గుర్తుల్ని ఆసరాగా తీసికొని బయలుదేరాను స్టేషనునుండి బయటపడి. చేతిలో సూటు

కేసు తీసికొని, మెల్లిగా పరిసరాల్ని చెట్లూ పుట్టల్ని పరిశీలిస్తూ ఆ అజ్ఞాత గౌరవనీయుని నివాసం వైపుకు కాలు సాగించాను.

మిట్ట మధ్యాహ్నమైనా ఎండ తీవ్రంగా లేదు. దట్టమైన చెట్లు, ఎత్తయిన కొండల మధ్య చల్లగా, హాయిగా ఉన్నది.

యిల్లు నిజంగా పర్ణశాలలా చక్కగా ఉన్నది. చుట్టూ అందంగా కాంపౌండు. లోపల యింటిచుట్టూ వివిధ రకాల పూల మొక్కలూ, కాయగూరలూ పెంచుతున్నారు.

యింటి పరిసర ప్రాంతాల్లోని సుందర ప్రకృతి సౌందర్యం ఒక ఎత్తూ, వారి ప్రాంగణంలోని తోట అందచందాలు మరి ఒక ఎత్తూ. గేటుతీసి లోపలి కడుగుపెట్టూనే బొడ్డుమల్లెల మధుర సౌరభం నన్ను ఉక్కిరి బిక్కిరి చేసింది ఎన్నోరకాల పూలు. ముద్దగులాబి, తీగ గులాబి, జాజిమల్లె, చేమంతీ, ఒకటేమిటి !— తన్మయుడ నయిపోయాను. ఏ లోకాల్లోనో, ఏ నందన వన ప్రాంగణంలోనో విహరిస్తున్నట్లు అనుభూతి పొందాను.

యింతలో ఒక నడివయస్సావిడ ఎదురొచ్చింది. నేను ఆమెకు చిరపరిచితుడ నైనట్లుగా, ఆమె ముఖంలో చిరునవ్వు చిందులాడింది. పరీక్షగా చూసాను. ఎర్రటి ఎరుపు, తల అక్కడక్కడ నెరసిపోయి ఉన్నది. వయస్సు నలుబది అయిదే ళ్లుండవచ్చు. ఆమె విశాలమైన నేత్రాల్లో ఏవో అగాధమైన భావాలు అల్లీబిల్లీగా అల్లుకు పోయినట్లు దృగ్గో

చరమైంది. ఆమె నిర్మలమైన వదనంలో ఎన్నో అనుభవాల రేఖలు.

బహుశః ఆ ప్రౌఢ మూర్తిగారికి బంధువు అయి వుండవచ్చు. ఎప్పుడో చిన్నప్పుడు నన్ను చూచి ఉంటుంది. తత్ఫలితమే ఆమె పెదవులమీది చిరునవ్వు, అని సరిపుచ్చుకొన్నాను.

ఆమె సాదరంగా ఆహ్వానించింది నన్ను. 'రా! రమేష్ బాబూ!... యిప్పుడే అనుకొంటున్నాం మీగురించి. అమ్మా నాన్నా రాలేదేం?...!' అన్నారామె నన్నుద్దేశించి.

నేను చేతులు జోడించి నమస్కరించాను సూట్‌కేస్‌ను ప్రక్కనున్న టేబుల్ మీద పెట్టి.

'నాన్నగారికి ఏదో ఆఫీసు పని అడ్డొచ్చింది. నన్ను ముందు వెళ్ళమన్నారు. బహుశః వాళ్ళు రేపు వస్తారు!' అన్నాను నమ్రతతో.

తిరిగి అన్నాను మూర్తిగారి ఆరోగ్యం ఎలా ఉందంటి! కబురు వినడంతోనే చాల ఆదుర్దా పడ్డాం – అసలు నాన్న గారికి ఆఫీసు పని ఉన్నదిగాని; ఆయన మనసంతా ఇక్కడే ఉండి ఉంటుంది. చాల ఆదుర్దా పడ్డారు!

'మూర్తిగారి దగ్గరకు తీసికెళ్తా రా బాబూ!' అని ప్రక్కనున్న గదికేసి నడిచారు ఆమె. నేను మౌనంగా వెంబడించాను. ఆమెను చూస్తుంటే నాకు అమితమైన గౌరవప్రపత్తులు ఉద్భవించినై మనస్సులో.

'ఎందుకో చెప్పలేం. కొందరిని చూడగానే మన హృదయాల్లో వారికి విశిష్టమైన స్థానం లభిస్తూ ఉంటుంది. కారణం ఏదో జన్మ జన్మాల అనుబంధాలు అయి ఉండ వచ్చు!

యిల్లు నాలుగు గదులుగా ఉన్నది. చాల శుభ్రంగా- అద్దంలా ప్రతిఫలిస్తోంది.

గుమ్మం దగ్గర ప్రసిద్ధ చిత్రకారుని సుందర ప్రకృతి దృశ్యం...చక్కటి ఫ్రేములో తగిలించబడి ఉన్నది. ఆ చిత్రంలోని రంగుల సమ్మిశ్రమం కంటికి యింపుగా కని పిస్తోంది. నా మనస్సు ఆ ప్రశాంతతలో... ఆ గదిలోని చిత్రపు అందానికి పరవశమైనది.

మూర్తిగారి గదిలోకి తీసికొని వెళ్ళిందామె. మూర్తి గారు మంచంమీద పడుకొని విశ్రాంతి తీసికొంటున్నారు.

'మన రమేష్ వచ్చాడు, లేస్తారూ!... అన్నదామె మృదువుగా.

ఆయన ఉలిక్కి పడ్డారు. హడావుడిగా, ఆతృతగా - లేవడానికి ప్రయత్నం చేసారు. ఆయనపై ఉన్న గౌరవ తత్ప రతలను, నాన్నగారి స్నేహితాన్ని పురస్కరించుకొని, గౌరవ భావంతో నమస్కరించాను...

ఆయనను చూస్తుంటే. పూర్వం యౌవనంలో, ఎంత ఆరోగ్యంగా, ధృడంగా ఉండేవారో అర్థం చేసికో డానికి ఎంతోసేపు పట్టలేదు. నాన్నగారు చెప్పినట్లు, ఆయన ఎదుర్కొనిన కఠోర సమస్యలు, అనుభవించిన కష్ట

పరంపర ఆయనను యిలా కృంగదీసి ఉంటయ్. నన్ను చూస్తూ అలా స్తంభీభూతులై కొంచెంసేపు ఉండి పోయారు స్తబ్దుగా... చాల ఆయాసంగా ఉన్నట్లున్నది.

'ఓపికగా లేదు మీకు...కూర్చోలేరు ... పడుకొని విశ్రాంతి తీసికోండి... నే నిక్కడ కూర్చుంటాను' అని పక్క మీద ఆయన పాదాల దగ్గర కూర్చున్నాను.

ఆయన పడుకోలేదు. ఏదో మాట్లాడుదామని అనుకొంటూనే నోరు పెగలక ఏదో అస్పష్టంగా అన్నారు.

ఆయన విశాలఫాలం జీవన సంగ్రామంలోని ఓటమికి తార్కాణంగా అర్థం పర్థంలేని గీతల్ని పులుముకొన్నది. ఆయన నేత్రాల్లో వాత్సల్య వాహిని పెల్లుబికి వస్తోంది. నన్ను ఆపాదమస్తకం క్షణకాలం పరిశీలించారు.

అమితమైన ప్రేమ వాత్సల్యాల వలన, మితిమీరిన ఆనందం మూలంగానూ, వాక్ప్రతిభ కట్టుబడి పోవచ్చునేమో కూడా! మరి ఆయన పరిస్థితి అలాగే ఉన్నది చూస్తే.

'యిటు రా నాయనా!' అన్నారు చేతులు చాస్తూ... ఆయన దగ్గరకు జరిగి కూర్చున్నాను. దిగ్గున తన చేతులతో లాక్కొని హృదయానికి హత్తుకొన్నారు. నేత్రాలు చెమర్చినై. ఆయన నేత్రాల్లో ఒక కొత్త వెలుగు ప్రజ్వలిస్తోంది-

'కరుణా! ఎన్నాళ్ళకు చూచాను రమేశ్‌ని...' అన్నారు, ఆమె వైపు తన్మయత్వంతో చూస్తూ.

యింతాకటినుండి నాకు ఆమె జ్ఞాపకమే లేదు. ఏదో

మూర్తిగారి యెడల గౌరవ తత్పరతల మైకంలో, ఏ లోకా కాల్లోనో తేలిపోతున్నాను.

తెలిసింది. ఆమె పేరు కరుణాదేవి గారన్నమాట... నిజమే... నిజంగా ఆమె కరుణాన్వీత...

ఆమె ప్రక్కనున్న స్టూలుమీద కూర్చున్నది; నన్ను, మూర్తిగార్ని, ఆనందంతో చూస్తూ. ఆయనకూడా నా రాకతో క్రొత్త సంతోషాన్ని పుంజుకున్నట్లే కనిపించింది.

ఆయన నా భుజాలు, వీపు, తల వాత్సల్యంతో, వారి అమృత హస్తాలతో నిమిరారు. అవీ, యివీ, ఆత్రంగా అడిగారు. వారు చూపే అనంతమైన వాత్సల్యానురాగాల ప్రభావంతో నా నేత్రాలు చెమర్చినై.

కొద్దిసేపటిలోనే మూర్తిగారు చాల అలసిపోయారు. అమ్మ, నాన్నగార్ల గురించి అవీ యివీ అడిగి అలసటచేత నడుం వాల్చా రాయన

మూర్తిగారు బాగా చిక్కిపోయి ఉన్నారు. నేత్రాలు నిస్తేజంగా ఉన్నై. వదనం పాలిపోయి ఉన్నది. తెగ ఆయాస పడ్తున్నారు. వారి జీవన సంధ్య దరిదాపుల్లోనే ఉన్నదని మాత్రం ఎవరైనా ఊహించటం అంత కష్టం కాదు.

తరువాత తృప్తిగా ఆ యిల్లాలి అమృత హస్తాల వడ్డనతో హాయిగా భోజనం చేసాను.

వరండాలో మంచం వేసికొని విశ్రమించాను చల్లటి గాలికి ప్రాణం ఏ లోకాల్లోకో పోయింది.

సాయంత్రం అయిదింటికిగాని మెలకువ రాలేదు. లేచి మొహం కడుక్కొని, మూర్తిగారికి చెప్పి, అలా... షికారుకు బయలు దేరాను... కాలవగట్టు వెంబడి.

కాలవగట్టున వెళ్తూ కూడ మూర్తిగారి గురించీ, ఆమె గురించీ ఆలోచనలు. వారి ఆప్యాయతా...ఆదరణా మధురిమా...

మర్నాడు అమ్మా, నాన్నగారూ, మధ్యాహ్నాని కల్లా వచ్చేసారు. నాకే చాల ఆశ్చర్యం వేసింది. ఈ కాలం కావలసిన బంధువులలో కూడ కనుపించని ప్రేమాభిమానాలు...ఆపేక్షలు ..స్నేహితులయిన వీరిలో ఎలా ప్రవేశించి వేర్లు పాతుకొని, బలం పుంజుకొని పటిష్టమయ్యాయోనని.

అమ్మా, కరుణాదేవి, సంతోషాతిరేకంతో ప్రేమాలింగనం చేసుకొన్నారు. నాన్న, మూర్తిగారు సరేసరి. వారి స్నేహాను బంధానికి నా ఒడలు పులకించింది నిజంగా యిదంతా జన్మ జన్మాంతర సంబంధం.

'ఏరా మూర్తీ,' 'ఏరా రాజుగా,' అనే ఒకరి నొకరు ప్రేమపూరిత సంబోధనలు, స్నేహామృతం చిలికే సంభాషణలు, వారిరువురి స్నేహమాధురి నా అంతరంగంలో కొంగ్రొత్త అనుభూతుల్ని ప్రసేపించింది.

అతిశయించే వారి స్నేహ వాత్సల్యాల మధ్య, జువ్వి చెట్ల ఈలపాటలు, పిల్లగాలి బిలబిలా పవనాల గలగలా రావాల యింపైన సంగీతాస్వాదనలోను, మహోన్నత గిరి కందరాల అతి సుందర ప్రాకృతిక దృశ్యాను వీక్షించి

ఆనందిస్తూ ఉండగానే నాలుగు రోజులు గడచి పోయినవని తెలిసికొని ఆశ్చర్య పడిపోయాను.

'కాలాన్ని మరపింపజేసి, హృదయాన్ని మురిపింప జేసే దివ్యమైన శక్తి ప్రకృతిమాతకే ఉంటుందని అనుకొన్నాను అప్పుడు.

బయట అంతా వెన్నెల. పడుకొందామంటే నిద్ర రావడంలేదు మూర్తిగారి జీవితాన్ని గురించే ఆలోచనలు కుప్పలుగా వచ్చి పడ్తున్నాయి మస్తిష్కంలో..

దూరంగా సెలయేటి ముహుర్ముహుర్నాదం, అడవి చెట్లగాలి పాటలూ, చీకటి పురుగుల కీచుశబ్దాలు, తెల్లని చంద్రుని చల్లని అమృత కిరణకాంతులు... వెన్నెల్లో దూరాన చెట్ల గుబుర్లలో తారట్లాడే అనంతమైన నీడల కాలిమ.

కాసేపు తోటలో కూర్చుందామని వెళ్ళాను.

చల్లటి మలయ సమీరం మెల్లగా శరీరాన్ని స్పృశిస్తోంది. దూరాన స్టేషన్లో దీపాలు మినుకు మినుకు మంటున్నాయ్ !

లోపల అంతా గాఢ నిద్రలో ఉన్నారు... వారంతా గాఢనిద్రలో మునిగిపోయి ఉంటే తాను ఆ విశ్రాంతికి, సుషుప్తికి అతీతుడులాగా, ఏమిటీ అర్ధరాత్రి తోటలో వచ్చాన్ల!... వెళ్ళి పచ్చికలో గులాబి ప్రక్కన కూర్చున్నాను.

గులాబి, జాజి మల్లెల పరిమళమిశ్రమం మత్తుగా వచ్చి నన్ను చుట్టేసింది. మూర్తిగారి ఆరోగ్యం రోజు రోజుకూ తీవ్రతరం కాకపోయినా, అధైర్యంగానే ఉంది. ఏవేవో

ఆలోచనలు. పచ్చటి పచ్చికపై పాదాల మెత్తటి సవ్వడి నా ఆలోచనలకు అవరోధమయింది. ప్రక్కకు తిరిగి చూచాను.

మూర్తిగారు!...ఆశ్చర్యపోయాను... యింత అర్ధరాత్రి...గాఢ సుషుప్తికి, విశ్రాంతికి అహేతుడైన నాకు తోడుగా యింకొక మనిషికూడ ఉన్నందుకు...ఆయాసంతో మెల్లగా అడుగులు వేసుకొంటూ వస్తున్నారు.

ఆత్రుతతో లేచాను...వెళ్ళి ఆయన రెక్క పట్టుకొంటూ...'మీరా!?... యింకా నిద్రపోలేదూ!?...' అన్నాను.

'నిద్ర పట్టడంలేదు బాబూ!...అయినా, నా జీవితానికి నిద్ర ఎప్పుడో కరువైందిలే...' అన్నారు. ఆయన కంఠంలో తీరని నిరాశ, ఆవేదన గూడు కట్టుకొని వున్నవి.

'అయినా యింత దూరం నడిస్తే అలసటగదా?... ఎలా వచ్చారు?'' అన్నాను.

ఆయన మెల్లగా నవ్వారు. వచ్చి తిరిగి యధాస్థానంలో కూర్చున్నాం.

'నిద్ర రావడంలేదా నాయనా, యిక్కడ కూర్చున్నావు?...' అన్నారాయన. ఏదో చెప్పాలని ఆతృత కనబడుస్తున్నారు.

తిరిగి ఆయనే అన్నారు. 'రమేశ్ బాబూ!...నీకు నిద్ర రావడంలేదుగా!...యివాళ నీకు ఒక కథ చెప్తాను,

విను. కథ అంటే ఎవరిదీ కాదు. నా జీవనగాథ చెప్తాను ఏం!'
అన్నారు.

నాకూ చాల ఉత్సుకతగా ఉన్నది. ఎప్పటినుండో అడుగుదామనుకొంటున్నాను. యివాళ ఆయనే వచ్చారు చెప్పడానికి.

'నాకు నిద్ర రావడంలేదు బాబుగారూ !—చెప్పండి, వింటాను' అన్నాను. ఆయనను 'బాబుగారూ' అని పిలవడం అలవాటయింది అప్పుడప్పుడూ ఆయనమీద నాకు గల గౌరవభావానికి ఫలితం ..

ఆయన దీర్ఘంగా నిట్టూర్చారు. ఆయన కళ్ళల్లో ఏదో అనిర్వచనీయమైన వింతకాంతి ప్రతిఫలిస్తోంది. యింతలో ఆయనను విపరీతమైన దగ్గుతెర సమ్మింది. కళ్ళు నిండిన నీళ్ళు వచ్చినంత పనయింది. తేరుకొని చెప్పడానికి ఉపక్రమించారు

'పాతికేళ్ల క్రిందట మాట...' మొదలు పెట్టారు బాబుగారు.

'నాకు అప్పుడు పాతికేళ్లుంటయ్. ప్రపంచమంతా యుద్ధపు అగ్ని జ్వాలల్లో దహించుకొని పోతోంది ఫాసిస్టు రాక్షసులు యితర ప్రపంచాన్నంతా కబళించి, ఏక ఛత్రాధిపత్యంగా ఏలుదామనే దుర్బుద్ధితో ముందడుగు వేశారు. మిత్రరాజ్యాలకు, సామ్రాజ్యవాదులకు మధ్య తీవ్ర సంఘర్షణ చెలరేగింది. జాపాను రాజ్యాధినేత, యిటలీ ముసోలినీ, జర్మనీ హిట్లరో ఏకమయ్యారు. మిగతా ప్రపంచం సమస్తం

ఒకటయింది. వారి ఆట కట్టించడానికి మనదేశం అప్పుడు బ్రిటిష్ ఆధిపత్యం క్రిందనే ఉన్నది. యువకుల్నందర్నీ సైన్యంలో చేరమన్నారు. చాలమంది యువకులు ఉత్సాహంతో సైన్యంలో చేరుతున్నారు. నిరుద్యోగ సమస్యతో సతమత మౌతున్న సిర్భాగ్యులకు నీడ లభించినట్లే అయింది మిలిటరీలో నౌకరీ దొరకడం.

అప్పుడు మా యింటి పరిస్థితులు చాల హీనంగా ఉండేవి. రోజులు గడవడమే కష్టంగా ఉండేది. నేనేమో అక్కడక్కడా ట్యూషన్లు చెప్పుకొని యిరవై, ముప్పై, సంపాదించేవాడిని.

అయినా, యింట్లో అమ్మా నాన్నలకు నేనంటే పడేది కాదు. కారణం ఆర్థికమైన యిబ్బందులే కాకుండా...యింకొకటి ఉండేది.

మా మేనమామ కూతురును నాకిచ్చి చెయ్యాలని మా వాళ్ళకు బలీయమైన కోర్కె ఉండేది. గాని నాకు మాత్రం యిష్టంలేదు. కారణం లక్ష్మి నా హృదయంలో స్థానం ఏర్పరచుకొన్నది. యింటిలో వారి మొండి పట్టుదలలు, అర్థంలేని కోరికలను సమర్థిస్తూ, నా లక్ష్మిని దూరం చేసికొని, మా అనురాగ బంధాన్ని తునాతునకలు చేసుకో దలచుకోలేదు.

ఫలితం...నాన్నకు ముఖాముఖిగా స్పష్టంగా చెప్పే

శాను. కోపంలో ఏవో అన్నారు. తరువాత బలవంతాన పెళ్ళి జరుగక తప్పింది కాదు.

ఆ రోజు లక్ష్మి నా హృదయాన వ్రాలి, 'నా కోపం ఎన్ని కష్టాల పాలయినారండీ!' అని సజల నయనాల్తో, దుఃఖం, ఆనందం సమ్మిశ్రితమైన చిరునవ్వు మొగంతో అంటుంటే, ఆమెను హృదయానికి హత్తుకొని, తల నిముర్తూ, నిన్ను మోసం చేస్తానా లక్ష్మీ!..యిక మనల్ని ఎవ్వరూ వేరు చేయలేరు.' అని ఓదార్చుతూ..కన్నీటిని తుడిచాను.

కొన్నాళ్ళు గడచిపోయినై.

ఒకవైపు నిరుద్యోగం...చాలీ చాలని చిల్లర సంపాదన.,.యింటిలో అశాంతి...కలతలు. .లక్ష్మి, నేను నాన్న వాళ్ళదగ్గరే ఉంటున్నాం. మేమంటే వారికి సద్భావం లేదు. పెద్దవాళ్ళయినకొద్దీ, మానవులకు మనసులు వెర్రితలలు వేస్తాయేమో. కొడుకునైన నన్ను, ఏదిమీద నారిమీద పెట్టి ..తిట్టుతుండేది అమ్మ. నాన్న ఎక్కువగా మాట్లాడే వారు కాదు నాతో. లక్ష్మిని సరిగ్గా చూచేది కాదు అమ్మ..

సంబంధం యిష్టంలేనంతమాత్రాన, నవమాసాలు మోసి, కని, మాతృమమతతో పెంచి పెద్దచేసిన ఆమెకు నేను కొడుకు, లక్ష్మి కోడలు కాలేకపోయాము. యింటెడు చాకిరీ చేయించేది లక్ష్మితో భోజనందగ్గర పచ్చడి మెతుకులే గతి అయ్యేవి లక్ష్మికి. కాని లక్ష్మికి ఎంత ఓర్పో చెప్పలేను.' అని కళ్ళు తుడుచుకున్నారు మూర్తిగారు.

లక్ష్మి కిమ్మనేదే కాదు. ఏ పని చెప్పినా చేసేది. ఎన్ని

అనినా పడేది. నాతో ఒక్కముక్క నోరెత్తి చెప్పేదికాదు. కాని ఆపాటి గ్రహించుకొనేశక్తి నాకు లేకపోలేదు.అయినా, నేనూ ఓర్పు వహించక తప్పిందికాదు. అరిటాకు, ముల్లు, సామెత చందంగా ఉన్నది అప్పటి నా పరిస్థితి. ఎవ్వరికి కోపం వచ్చినా నాకే నష్టం వెనుకా ముందూ చూచుకోవాల్సి వచ్చింది.

యిక ఎటూ పాలుబోక మిలిటరీలో చేరుదామనుకొన్నాను. తప్పకుండా సెలెక్టవుతానని నమ్మకం వుంది. నే నా రోజుల్లో ఆరోగ్యంగా, బలిష్టంగా ఉండేవాడిని

యుద్ధంలో చేరి జీతం పంపుతూ ఉంటే, ఇంటిలో కలతలు వాటంతట అవే సద్దుమణిగి, మటుమాయ మవుతయ్యేలే అని అనుకొన్నాను.

యిక నా లక్ష్మి నుండి కొన్నేళ్ళు వియోగ బాధ అనుభవించాలని తలచుకొని గుండెను దిటవుపరచుకొన్నాను. నేనేమీ పెద్ద చదువులు చదవలేదు యింటి పరిస్థితులవల్ల ఫోర్తుఫారంతోనే చదువుకు స్వస్తి వాక్యాలు పలుకవలసి వచ్చింది. కాని చిన్నప్పుడు ఏ పుస్తకం దొరికితే అది క్షుణ్ణంగా చదివి, దానిలోని లోతుపాతులు అర్థంచేసుకుంటేనే గాని నిద్ర పట్టేదికాదు. యింగ్లీషు, తెలుగు సాహిత్యాల గొప్పతనాన్ని, మెళకువల్ని వంటపట్టించుకొన్నాను. ఇంగ్లీషు ధారాళంగా మంచి వుచ్చారణతో మాట్లాడ గలిగేవాడిని. కాని నాకు ఉద్యోగం రావాలంటే, యింత విజ్ఞానముండీ. డిగ్రీ అడ్డువచ్చింది.

చివరికి మిలిటరీలో చేరడానికే నిశ్చయించుకున్నాను. అప్పుడు లక్ష్మి గర్భిణి. యింకా కొన్నాళ్లు గడిస్తే మా కష్టాల్లో పాలు పంచుకోడానికి యింకో ప్రాణి యింటిలోకి అడుగు పెడ్తుంది. అలాంటి లక్ష్మిని ఒంటరిదాన్ని చేసి రాక్షసుల చేతిలో వదలి వెళ్లామంటే నా అంతర్యం వెనుకంజ వేసింది. కాని అంతకన్న వేరు గత్యంతరం లేదు.. తప్పదు... నా భవిష్యత్తుకు, లక్ష్మి, పాప భవిష్యత్తులకు, ఈ తాత్కాలిక వియోగం భరించక తప్పదు...మంచిరోజులు తప్పకుండా వస్తాయి.

జతగుడ్డలు సంచిలో పెట్టుకొని తెల్లవారుఝామున బండికి బయలుదేరాను. రెండే గుడ్డలు. పైకి ఏమీ కనుపించ లేదు. ఎవ్వరికీ అనుమానం కలుగలేదు. మంచిదే అయింది. సాయంత్రానికల్లా తిరిగివస్తాననీ, తెనాలిలో ఏదో పని ఉందనీ చెప్పి బయలు దేరాను. అసలు రహస్యం లక్ష్మికి కూడ చెప్పలేదు చూచాయగా కూడా.. బయలుదేరి వచ్చేసిన తరువాత అనిపించింది. లక్ష్మికన్నా చెప్పి రావలసిందని.

బయలుదేరేముందు ఆ రాత్రి లక్ష్మితో అన్నాను 'నన్ను పెళ్ళాడి చాల కష్టాలు పడ్డావు లక్ష్మి!' అని.

'మీరు నా కళ్ళముందుంటే చాలు! యివన్నీ కష్టాలు టండీ నాకు? అయినా నా హృదయాన్ని అర్పించిన, మీరు, నా వారయ్యారు నా కింకేమి లోటు యిక డబ్బంటారా?! అది ఇవాళుంటుంది, రేపు పోతుంది. దాని దేముంది నేను ఎంత భయానక హాలాహలాన్నయినా...

అమృతప్రాయంగా చవి చూస్తాను యిక.' అన్నది నా లక్ష్మి సజల నయనాల్తో రుద్ధ కంఠంతో.

ప్రేమానురాగాలను ధనపు సంచులతో బేరీజు వేయకుండా, నిర్మల నిష్కల్మష ప్రేమను ప్రదర్శించే నా లక్ష్మి ఉత్తమోత్తమురాలు !!.

తిరిగి రెట్టించాను లక్ష్మిని 'నిజంగా దాయకుండా చెప్పు లక్ష్మీ !!.. నన్ను కట్టుకొని, నువ్వు ఏమి సుఖం అనుభవించావ్ చెప్పు ? ..లోలోపల బాధపడటల్లా ?. .బహుశః మొదట నా స్థితి యింత హీనంగా ఉంటుందని అనుకొని ఉండవు. జీవితాంతం యిలాగే మన జీవితం బాధలతో గడవాల్సి వుంటే నన్ను కట్టుకొన్నందుకు పశ్చాత్తాప పడతావేమో గూడా...'

లక్ష్మి నిర్మల నేత్రాంచలాల్లో కన్నీరు వచ్చింది అదాటున కూర్చుని నా పాదద్వయాన్ని తన హస్తాలతో స్పృశిస్తూ ..విషాదమూర్తి అయి అన్నది . 'నాకేం బాధ లేదు. మొదటినుండీ మీ పరిస్థితులు, స్థితిగతులు పూర్తిగా తెలుసును. యింతకన్నా హీనంగా ఉన్నా అవన్నీ మీ కోసం తప్పక సహిస్తాను నాకు మీ అచంచలమైన ప్రేమానురాగాలు కావాలి. అంతే జీవితాంతం మీ రన్నట్లు యిలా బాధామయ జీవితాన్ని గడపటానికికూడ నా నిశ్చయం అచంచలమైనదే. కాని మన జీవితాలు చివరివరకు యిదే స్థాయిలో ఉంటాయనిమాత్రం నేను అనను మంచిరోజులు

వచ్చి తీరుతయ్ మనకు మనంకూడ ఆనంద డోలికల్లో వూగిసలాడుతాము అలా ఆశించాలి మరి '

ఆమె దృఢ మనోగతభావాలకు, దీక్షాపటిమకు, ఆశావాదిత్వానికి. నా మనస్సులోనే నివాళు లర్పించుకొన్నాను. నా లక్ష్మి నాతో, నా ప్రయత్నాలతో సహకరిస్తుంది. నా కేమీ అనుమానం లేదు. యిక నా జీవితాన్ని తీర్చి దిద్దుకోడానికి మార్గాన్వేషణ చేయవలసింది నేను...

ఎన్ని ఓటములు చవిచూసినా, మానవుడి హృదిలో ఆశ అనేది లేశమంతైనా ఏమూలో తప్పకుండా ఉంటుంది. నాకూ ఆ ఆశాలేశం మనో అంతరాళంలో ఎక్కడో స్పందిస్తోంది 'మంచిరోజులు వస్తాయి నాకుకూడా' అనుకొన్నాను దృఢంగా.

తీరా ఇల్లువదలి వచ్చేసిన తరువాత లక్ష్మిని విడిచి కొన్నాళ్లు దూరంగా ప్రవాసినై వెళ్ళిపోతున్నాననే తలపు రాగానే మనసు తల్లడిల్లిపోయింది.

బెజవాడ చేరాను. మిలిటరీ రిక్రూటింగ్ ఆఫీసు అక్కడే ఉన్నది ఆఫీసుకు వెళ్ళాను నాలాంటి యువకులు చాలామంది బారుల్లో నిల్చుని వున్నారు. వారి వదనాల్లో ఏదో అనిర్వచనీయమైన ఆనందం, తృప్తి ద్యోతక మౌతున్నాయ్ వారి దృఢమైన తేజో పూర్ణమైన శరీరాల్లో వేడి యువకరక్తం ఉరకలు పెడ్తోంది. నా వేదనా పూరిత మైన మోము, వారిని చూడగానే ఉషోకాంతులతో తేజ

రిల్లింది నా బాధల్ని, యింటివద్ద నా అనుబంధాల్ని, తాత్కాలికంగా మరచిపో గలిగాను.

ఆఫీసరును కలిసాను. ఏవేవో పరీక్షలు చేసారు. అంతా సవ్యంగానే ఉన్నది. మర్నాడు వ్రాత పరీక్షకు రమ్మన్నారు ఆ రోజు నా దగ్గరున్న కొద్ది పైకంతో ఏదో దగ్గరనున్న లాడ్జిలో బసచేసాను. మర్నాడు ఆ వేళ్టికి మళ్ళీ ఆఫీసుకు వెళ్ళాను. టెస్టుకు పది పదిహేనుమంది వచ్చారు. నాతో బాటు: చాల మంది గ్రాడ్యుయేట్స్. నాకు చాల ఆశ్చర్యం వేసింది.

కమాండర్ ప్రతి ఒక్కరితో విడివిడిగా యింటర్వ్యూ చేసాడు. భుజం తట్టూ ఏవేవో యింగ్లీషులో అడిగాడు. నేను చదివింది తక్కువైనా యింగ్లీషు ధారాళంగా మాట్లాడేవాడిని. నేనూ హుషారుగా, బెరుకు లేకుండా, మంచి ఉచ్చారణతో యింగ్లీషులోనే మాట్లాడాను. కమాండర్ సంతోషించాడు టెస్ట్‌కూడా బాగా వ్రాశాను. అది ఒక పరీక్ష అనిపించ లేదు నా మటుకు నాకు. నేనూ, యింకా నలుగురూ, ప్యాసయ్యాము.

అప్పుడే పరిచయమయింది మురళితో. నా కంటె వయస్సు కొంచెం తక్కువ. రెండేళ్ళ తేడా ఉండవచ్చు మా యిద్దరికీ. కొద్ది సేపట్లోనే నాకు అతను ప్రాణ స్నేహితుడై పోయాడు.

కొందరి స్నేహాలు అలాగే జరుగుతూంటయ్. కలసిన కొద్దిక్షణాల్లోనే ఒకరి నొకరు క్షుణ్ణంగా అర్థంచేసికొనడం

జరుగుతుంది. ఏదో అజ్ఞాతమైన శక్తి వారిద్దర్నీ ఒక చోట కూరుస్తుంది. అదంతా జన్మాంతరానుబంధాల ప్రభావం. నేనూ మురళి ఫిరోజ్‌పూర్ రెజిమెంట్‌లో జాయిన్ అవాలి. మా ఆర్డరు తీసికొని సాయంత్రం బండికే బయలు దేరాము.

ఇంతలో వికృతమైన దగ్గుతెర మూర్తిగార్ని ఉక్కిరి బిక్కిరి చేసింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. ఆయన స్వీయ గాథను అలా వెళ్ళబోసుకొంటూ ఉంటే, విన్నవాడికి నాకే మనస్సు వికలమైనది. దూరాన రైలు కూత సన్నగా ధ్వని స్తోంది. అర్ధరాత్రి పూటకూడ రైలున్న దన్నమాట.

దూరాన చెట్ల సందుల్లోనుండి, చంద్రుడి అమృత కిరణాలు నేలను చుంబిస్తున్నాయ్. యింతలో ఉధృతంగా గాలి వీచింది. జాజిమల్లె జలజల లాడింది. గులాబి గుబురు గుబగుబ లాడింది.

మూర్తిగారు దగ్గు తెరనుండి తేరుకొన్నారు 'వెధవ దగ్గు కూడా ఒకటి నాయనా!... ప్రాణాల్ని తోడేస్తోంది' అన్నారు...తిరిగి చెప్పడం మొదలెట్టారు.

రైలు ప్రయాణంలోనే మురళి నాకు మరింత సన్ని హితుడైనాడు. ఆతని యావద్వృత్తాంతం వివరంగా చెప్పాడు. తల్లీ దండ్రీ చిన్నప్పుడే దూరమయ్యారు దగ్గర బంధువు లెవరో ఒకాయన తనను పెంచుతానని నమ్మకంగా మాట యిచ్చి, ఆస్తి తన పేర వ్రాయించుకొన్నాడట. తండ్రి పోయిన తరువాత యస్. యస్. యల్. సి. వరకు చదివిం చాడట. తరువాత తనకు సంబంధం లేదని, తా నిక చది

వించలేనని చెప్పివేసాడట. ఆస్తిచేజిక్కింది. పుత్రెకు పుట్టెడు బుద్ధులు. ఇతనికి వేరే గత్యంతరం లేక చందాలు ప్రోగుచేసు కొని, స్కాలర్షిప్తోనూ, బి యే. వరకు చదివాడట. యిలా సైన్యంలో చేరడం నిరుద్యోగంతో బాధపడి ప్రగ్గి మాడే కన్నా – యిదే వుత్తమ మనిపించడం వల్లనేనట.

ఫిరోజ్పూర్ చేరాము... రెజిమెంట్కువెళ్ళి కమాండరును కలిసాం. కమాండర్ ఒక యింగ్లీషు యువకుడు. పేరు లెఫ్టినెంట్ కమాండర్ జేమ్స్. మమ్మల్ని చూచి చాల సంతోషించాడు. భుజం తట్టూ 'మీలాటి యువకులు సైన్యంలో యింకా చేరాలి !' అన్నాడు. నా యింగ్లీషు భాషోచ్చారణకు ఆయనకూడ స్టన్ అయిపోయాడు. నా పేరు, మురళి పేరు అడిగి తెలుసుకున్నాడు.

అంతా క్రొత్త వాతావరణం. నన్నూ, మురళిని స్టోరున్లో వేసారు, అంతా టైం ప్రకారం పనులు జరిగి పోవాలి. మాకూ కవాతులు ఉండేవి. రైఫిల్ ఆపరేషన్ కూడ నేర్పారు. కమాండర్స్ గొంతులు చించుకొని అరు పులూ, తోటి సిపాయిల హుషారయిన మాటలూ, అక్కడి వాతావరణం ఉల్లాసకరంగా ఉండేది. మురళిని గురించి మరి ఒకటి చెప్పడం మరిచాను. అతను మాండొలిన్ చక్కగా, అతిమధురంగా వాయించేవాడు సాయం సమయాల్లో. లీజర్ అప్పుడు ఆఫీసర్లు దగ్గరనుండి, అందరూ ప్రోగయ్యేవారు మురళి మాండొలిన్ వినడానికి. మాండొలిన్ మూలంగా

మురళి అందరికీ సుపరిచితుడై పోయాడు. మే మిద్దరం అన్న దమ్ములలాగా మెలిగేవాళ్ళం. అంతా అలాగే అనుకొనే వారు మమ్మల్ని గురించి. చివరికి లెఫ్టినెంట్ జేమ్స్ కూడ మురళి, నేనంటే ప్రత్యేకాభిమానం చూపించేవాడు.

ఫిరోజ్‌పూర్ చేరిన తరువాత యింటికి ఉత్తరం వ్రాశాను. లక్ష్మి పేరుతో మరియొక వుత్తరం కూడా విడిగా వేశాను. యింటి పరిస్థితుల్ని దృష్టిలో ఉంచుకొనే యిలా ఇల్లు వదలి రావాల్సి వచ్చిందని కులాసాగా ఉన్నాననీ సవివరంగా వ్రాశాను.

వారంకల్లా ఇంటి వద్దనుండి జవాబు వచ్చింది. మొట్ట మొదట నే వెళ్ళిన రెండు రోజుల తరువాత నేనే మయినానో నని భయపడ్డారట నా ఉత్తరం చూడగానే ప్రాణాలు లేచి వచ్చినయ్యట. నాకు వచ్చే జీతం వివరాలు తెలిసికోవాలని ఉన్నదట. నా లక్ష్మి ప్రస్తావన ఒక ముక్క కూడ లేదు నేను చాల బాధపడ్డాను.

మనుషులు దూరంగా ఉంటే. .ఆప్యాయతలు ఇను మడిస్తాయనే విషయం లోక విదితం. కానీ ఈ ఇంటి దగ్గ ర్నుండి వచ్చిన ఉత్తరంలో నామీద ప్రేమకన్నా, నా జీతంమీద ఎక్కువ గౌరవం ఉన్నట్లు స్పష్టంగా తెలు స్తోంది.

ఎందుకు ?...లక్ష్మి, నా జీవన సుఖ దుఃఖాల భాగ స్వామి, నా ప్రాణంలో ప్రాణం, ఆమె అంటే వారి!..ఆజన్మ

శతృత్వం ఎందుకు...లక్ష్మి జవాబు కోసరం అత్యంతమైన ఆశతో ఎదురు చూసా<. నా ఆశలు నిరాశలయి పోయినై.

నాకు అనుమానం కలిగింది; అసలు లక్ష్మికి నా ఉత్తరం సవ్యంగా అందిందా అని. తనను శతృవుగా భావించే వారందరి మధ్యా, ఆ నరరూప రక్కసుల మధ్య, లక్ష్మి యిన్నాళ్ళు ఎలా నెగ్గుకు రాగలుతుందా అని. లక్ష్మి దుస్థితి తలచుకొంటే నా గుండె చెరువయిపోయింది ఎందుకు వచ్చే సానా అనిపించింది. కాని తప్పదు. చేరిన తరువాత బయట పడడం అసంభవం.

నెల నెలా యింటికి డబ్బు పంపుతూనే ఉన్నాను. వారి దగ్గరనుండి అతిశయించిన అనురాగాలు ఒలకపోస్తూ ఉత్తరాలు వస్తూనే వున్నాయ్. అదంతా డబ్బు ప్రభావం. డబ్బు! అసంభవాన్ని సంభవంగా మార్చే శక్తి దానికే ఉన్నది!! కాని నా లక్ష్మినుండి ఉత్తరం ముక్కలేదు. ప్రతి నెలా డబ్బు పంపుతూ లక్ష్మికి కొంత యివ్వమని వ్రాసే వాడిని. అదిగూడ సరిగ్గా ఇస్తున్నారో లేదో... భగవంతుడికే తెలియాలి.

ఒక సంవత్సరం కాలచక్రపు పరిభ్రమణంలో వెను కకు వెళ్ళిపోయింది

యిప్పుడు నా ఆరోగ్యం చాలా బాగా ఉన్నది. క్రమబద్ధమైన కార్యక్రమాలు; పుష్టికరమైన ఆహారం; కాయ కష్టం. మనిషిని ఎర్రగా, ఏపుగా, దృఢంగా పెరిగాను. యిదివరకటి నాకు, యిప్పటి నాకు, ఏమీ పోలికలు లేవు.

నేనుగనక యింటికివెళ్తే లక్ష్మిగాని, మిగతావారుగాని, తేలికగా గుర్తుపట్టడం కష్టమే. మురళి సరేసరి. మాంఛి యిదిగా తయారైనాడు.

యిదివరకు మురళి ఎప్పుడూ ఏదో ఆలోచనా తరంగాల్లో మునిగి తేలేవాడు. కాని యిప్పుడు అలాకాదు. హాయిగా హుషారుగా ఉంటున్నాడు. తన సంతోషానికి కారకుడిని నేనే అంటాడు నేనంటే ప్రాణాలు అర్పించేసేవాడు.

పదిహేనురోజులు సెలవు పెట్టాను యింటికి వెళ్ళాలని. ముఖ్యంగా నా లక్ష్మిని కలుద్దామని. ఎలా ఉందో! నేను వచ్చేసేటప్పుడే గర్భిణి. ఏ విషయమూ తెలియదు. కఠినహృదయులు. లక్ష్మికి సంబంధించిన ఏ విషయమూ నాకు చేరడంలేదు.

యింటికి వెళ్ళాను. అమ్మ ఎదురొచ్చింది, యిదివరకు ఎన్నడూ నేను కలలో కూడ చూడని, సంతోషం, వాత్సల్యం వ్యక్తంచేసింది. నన్ను చూడగానే లక్ష్మి ఉక్కిరి బిక్కిరి అయిపోయింది ఆనందంతో... ఆమె వదనం అత్యంత విషాదావృతమై ఉంది. ఆమె నయనాల్లో విచారపు నీలినీడలు తొంగికిసలాడినవి.

లక్ష్మికి మగపిల్లవాడు. నా బాబు! నాకు, నా లక్ష్మికి ప్రతిబింబితమైన చిన్నారి బాబు! కాని యిద్దరిలోనూ కళా కాంతులు లేవు.

'ఉత్తరాలకు జవాబు వ్రాయలేదేమిటి లక్ష్మీ!' అని అడిగాను. లక్ష్మి నిర్ఘాంత పోయింది.

'మీ ఉత్తరాలు ఒక్కటీ అందలేదు నాకు' అన్నది. నేను అనుకొన్నట్లే జరిగింది. అంతా వీళ్ళు ఆడిన ఆటే. డబ్బుగురించి అడిగాను. ఒక్క పైసాకూడా యివ్వలేదుట. కోపం వచ్చింది. వెంటనే వెళ్ళి అడిగాను. 'లక్ష్మికి వ్రాసిన ఉత్తరాలన్నీ ఏమైనా'యని.

వారేమీ ఎరుగమన్నారు. అసలు ఒక్క ఉత్తరం కూడ అందలేదన్నారు. పోనీ డబ్బు అందిందికదా, ఒక రూపాయన్నా లక్ష్మికి యిచ్చావా అని ఉండబట్టలేక అడిగేసాను. 'విడిగా దానికి యివ్వడమేమిట్రా. యిది అందరికీ ఖర్చుచేసేదేకదా' అన్నది అమ్మ. యిష్టమొచ్చినట్టు నానా మాటలు అన్నాను. యిన్ని బాధలు పడ్తున్నా లక్ష్మి ఒక్కమాటకూడా, తనకు తానుగా వచ్చి నాతో చెప్పలేదు. అన్నీ నేనడిగినతరువాత బయటపడిన విషయాలే. వచ్చేసేముందు లక్ష్మికి చాటుగా అవసరాలకు డబ్బు యిచ్చాను. పిల్లాడి ఆరోగ్యానికి మందులు కొని తెచ్చాను. ఉన్నన్నాళ్ళూ ఏమీ మాట్లాడుకోవాలన్నా, ఎప్పుడూ ఎవరో ఒకరు మా వెనుకాల ఉండే వాళ్ళు పదిహేనురోజులు ఇట్టే గడచిపోయినై. భారహృదయంతో తిరిగి వచ్చేసి డ్యూటీలో చేరాను.

డ్యూటిలో చేరిన వారం, పదిరోజులవరకు ఏదో అన్య మనస్కంగా ఉండేవాడిని. అన్ని ఆలోచనలు లక్ష్మిగురించే.

లక్ష్మి అసలు విషయాన్ని హృదయంలోనే దాచుకొని పైకి ఏమీ చెప్పకపోయినా, ఇంటి చుట్టు ప్రక్క లవాళ్ళు, అన్నీ వివరంగా నా చెవిన వేసారు. నేను మిలిటరీ వచ్చేసిన తరువాత లక్ష్మిని తెగ ఏడిపించారట. నీ మూలంగానే ఇల్లువదలి పెట్టి, కాని దేశాలు పట్టాడనీ, నా కొడుకును పాడు చేసావు అని, ఒకటేమిటి, అన్ని అనర్థాలకు మూల కారకురాలు లక్ష్మిట. భోజనం అందరితో బాటు పెట్టేవాళ్ళు కాదట. చాకిరీకిమాత్రం అది కావాలి భోజనందగ్గర రెండు మూడు రోజులక్రిందటి పచ్చళ్ళతో కారపు మెతుకులు, చివరికి ప్రసవ వేదన పడ్తూంటే కూడ ఒక్కరూ దగ్గర కెళ్ళ లేదట. ఆ సంగతు లన్నీ మరచిపోయి, తిరిగి యధాప్రకారం అక్కడి వాతా వరణంలో లీనమవడానికి, కొన్నిరోజులు పట్టింది. మళ్ళీ చేరిన తరువాతకూడ ఉత్తరం వ్రాశాను లక్ష్మికి కూడ విడిగా వ్రాశాను ఈ సారైనా అందకపోవునా అనే భరోసాతో.

జవాబుకోసం నిరీక్షించే సమయంలో మేము గొప్ప అడ్వెంచర్ చెయ్యాల్సి వచ్చింది. మా ట్రూప్ మలయాలో పని చేయాలని తంతి వచ్చింది రెండు రోజులలో అందరం బయలుదేరాలి. రెండురోజులలో నైనా లక్ష్మినుండి ఉత్తరం. వస్తుందేమోనని వేయికళ్ళతో ఎదురు చూచాను. ఫలితం శూన్యం.

నా లక్ష్మి మూర్తీభవించిన విషాదంతో నా ఎదుట నుంచొని 'నిన్ను ప్రేమించి, హృదయాన్ని అర్పించినందు

కిదేనా ప్రతిఫలం!' అన్నట్లు నా కళ్ళముందు ఆమె మూర్తి లీలగా తారట్లాడింది. ఆమె వదనంలోని తీవ్రమైన విషాదరేఖల్ని మననం చేసికొని ఖిన్నుడనైనాను. నేనేమీ చేయగలిగే స్థితిలో లేను నా ఆవేదనా కడలికి వారధికట్టి తాత్కాలి కోపశమనం కలిగించుకొన్నాను మలయా ప్రయాణపు తయార్లలో మునిగి పోయాము.

ఒక వైపు క్రొత్త దేశాన్ని, క్రొత్త ప్రజల్ని, సరి క్రొత్త వాతావరణాన్ని చూ ఆనందించ బోతున్నామనే ఉత్సాహం, ఉత్సుకత, మరోవైపు నా జీవన భాగస్వామి నుండి యింకా దూరంగా, అతిదూర తీరాలకు నెట్టి వేయ బడుతున్నాననే దిగులు, హృదయాన్ని కదలించి వేస్తూంది.

'క్రొత్త దేశానికి వెళ్ళబోతున్నాం ఫ్రెండ్స్! బాగా ఎంజాయ్ చెయ్యండి!' అన్నాడు కమాండర్ జేమ్స్. ఓడ ఎక్కే ముందు అందరితో కరచాలనం చేస్తూ.

సముద్రపు ప్రయాణంలో గొప్పఅనుభూతి పొందాము. ఆ మహార్ణవపు మహోన్నత తరంగాలు, శరీరాన్ని పులకింప జేసే చల్లటి సముద్ర సమీరం, సూర్యోదయ, సూర్యాస్తమయ సమయాల సముద్రపు అగాధాల్లో ప్రతిఫలించే వింత రంగులు, రాత్రి పూట అంబరంలో సంబరంతో మెరిసి పోయే చందమామ, నక్షత్ర సముదాయాల వింతైన విన్యాసం... వింత వింత అనుభూతులతో, వింత వింత లోకాల్లో తేలిపోయాం.

మలయా చేరిన తరువాత ఏదో గాఢ సుషుప్తిలో

కలలుగన్నట్లు అనిపించింది. మన భాష, మన లోకం కాదు. ప్రజల వేషభాషలు, పరిసరాలు, వాతావరణం, అంతా క్రొత్త క్రొత్తగా, భిన్నంగా ఉన్నవి.

ఒక రోజు సాయం సమయాన మురళి, నేను అలా నాలుగు వీధులు చుట్టి వచ్చాము దారిలో మార్కెట్టు తటస్థపడ్డది. ఎలాంటి కూరలు దొరుకుతాయో అని లోపలికి వెళ్ళాము. ఆశ్చర్య పడ్డాము. చచ్చిపోయిన కప్పలు. నీటి పాములు, వ్రేలాడ తీసి వున్నై. అవి కూడ వారి భోజనాల లోని ఒక భాగమే అని తెలిసింది. అసహ్యమూ వేసింది, ఆశ్చర్యమూ వేసింది. మురళి నేనూ తెగ నవ్వుకున్నాము.

ఒక రోజున సాయంత్రం పూట తీరిక వేళలో మా క్యాంపు దగ్గర మ్యూజిక్ పార్టీ పెట్టాము. ప్రోగ్రాం సగంలో ఉండగా ఎవరో నడివయస్కుడు అటుగా వచ్చాడు. మంచి ఆజానుబాహువు. ఇంగ్లీషువాడి మాదిరిగా కనుపించాడు వేష భాషల్నిబట్టి. కాసేపు కూర్చుని మురళి మాండొలిన్ విన్నాడు. సంతోషంతో వుబ్బి తబ్బిబ్బై పోయాడు. వాయించడం పూర్తికాగానే లేచివచ్చి, మురళి చేయిపట్టుకొని వూపుతూ, చాల మెచ్చుకొన్నాడు. నన్నూ మురళిని మర్నాడు అదే వేళ్టికి తన యింటికి రమ్మన్నాడు. మా క్యాంపుకు దగ్గర్లోనే ఉన్నది ఆయన ఇల్లు. ఆయన పేరు డాక్టర్ విలియమ్సట. వయస్సు యాభై సంవత్సరాలు ఉండవచ్చు.

వాళ్ళు మలయా వచ్చి చాల రోజు లయిందిట.

కమాండర్ జేమ్సుతో ఏవేవో మాట్లాడాడు ఆయన. పరాయి దేశంలో స్వదేశస్థుడు కనిపిస్తే పొంగివచ్చిన ఆనందం, ఆప్యాయత, అభిమానం మరి.

మార్నాడు డాక్టర్ విలియమ్స ఆహ్వానం ప్రకారం సాయంత్రం పూట యింటికి వెళ్ళాం. చిన్న డాబా. చుట్టూ ప్రహరీ, లోపల చక్కని తోట.

వెళ్ళేటప్పటికే డాక్టర్ మా కోసరం ఎదురు చూస్తున్నాడు.

మిసెస్ విలియంస్‌కు, వాళ్ళమ్మాయిలు రోజ్ మేరీ, లూసీలకు, పరిచయం చేసారు. మిసెస్ విలియంస్ ఆనందానికి అవధుల్లేవు. 'ఇండియన్' అని సంబోధిస్తూ హుషారుగా ఆ వూరి విశేషాలు, ప్రజల ఆచార వ్యవహారాలు వివరంగా చెప్పింది. అందరము కలసి లైట్ రిఫ్రెష్‌మెంట్ తీసికొన్నాం. వచ్చేసేముందు మేరీ, లూసీలు సంతోషంతో చేయి కలుపుతూ, తీరిక దొరికి నప్పుడల్లా వచ్చిపోతుండమని కోరారు. ఆ అమ్మాయి లిద్దరూ కూడ చాలా చలాకీ వాళ్ళు. కాసేపట్లోనే చాలా హుషారుగా మాట్లాడారు.

తీరిక దొరికి నప్పుడల్లా, అలాగే వాళ్ళింటికి వెళ్లి ప్రొద్దుపుచ్చే వాళ్ళం. కొన్ని రోజులు గడచిపోయినై. మా యిద్దరమంటే ఆ విలియంస్ ఫామిలీకి ఒక విశిష్టమైన గౌరవం, అభిమానం ఏర్పడ్డది. తానే మురళికి సన్నిహితురాలైంది. మురళి అంటే ఆమెకు ప్రత్యేకాభిమానం ఉండేది.

రోజ్ మేరీ నాతో అవీ యివీ కబుర్లు చెప్తూండేది. ఆమె ఎప్పుడు అత్యంత నిర్మలంగా, గంభీరంగా ఉండేది. అప్పు డప్పుడూ మురళి మాండొలిన్ ప్రోగ్రాం పెట్టేవాడు వాళ్ళ యింటిలో.

సమయం దొరికి నప్పుడల్లా మురళీ, లూసీ షికార్లుకు వెళ్ళే వాళ్ళు. లూసీ బలవంతంగా మురళీని క్లబ్బులకు తీసి కెళ్ళేది. అప్పుడప్పుడూ మాండొలిన్ వాయించే వాకట అక్కడ.

నేనూ మేరీ మాట్లాడుకోని విషయాలు లేవు. మేరీకి మన దేశమంటే ప్రత్యేకమైన అభిమానం ఉండేది. మన గురించి, ప్రజల నాగరికత, ఆచార వ్యవహారాల గురించి నా చేత చెప్పించుకొని. ఆనందించేది. నా మాదిరిగానే ఆమెకు కూడ సాహిత్యాభిలాష మెండు. తెలిసినవి, తెలియనివి, ఎన్నో చర్చించుకొనే వాళ్ళం — ఆమెతో మాట్లాడుతూ ఉంటే ఎవరో ఆత్మీయురాలితో మాట్లాడు తున్నట్లు అను భూతి కలిగేది.

ఇంటికి ప్రతినెలా డబ్బు వెళ్తూనే ఉండేది ఇక్కడికి వచ్చిన తరువాత ఉత్తరాలు ఎక్కువగా రావడం లేదు. లక్ష్మి ఉత్తరాల జాడమాత్రం తెలియదు బెంగగా ఉన్నా గుండె దిటవు చేసికొని, ముందు రాబోయే మంచిరోజుల్ని తలచు కొని, ఆనందిస్తూ గడిపేవాడిని నా బాధల్ని తాత్కాలి కంగా నైనా మర్చిపోగలగడానికి డాక్టర్ విలియాంస్ కుటుం బపు మంచితనమే ముఖ్య కారణం.

ఒక్కో రోజున రోజ్ మేరీతో మాట్లాడుతున్నా, ఆలోచనల్లో ఉండేవాడిని.

'ఏమిటి డియర్ ! అలా ఉన్నావ్ ? సంగతేమిటి !?' అని అడిగేది ఆతృతతో మేరీ.

ఏదో జవాబు చెప్పి తప్పించుకొనే వాడిని. నేను విచారంగా ఉంటే, నన్ను మామూలు మనిషిని చేయాలని, నన్ను సంతోష పరచాలని, ఎన్నో విధాల ప్రయత్నించేది – ఎడతెరపి లేని ఉద్యోగంలోనూ, డాక్టర్ విలియంస్ వాళ్ళ నిర్మలమైన అనురాగ వాత్సల్యాలలోనూ తెలియకుండానే సంవత్సరం పైచిలుకు గడచిపోయింది.

మురళి, లూసీల స్నేహం పరస్పరాకర్షణలకు దారి తీసింది. వారిద్దరి అతి సాన్నిహిత్యం క్రొత్త పుంతలు త్రొక్కింది. అమాయకమైన లూసీ, మురళి ఉద్రేకానికి, ఆవేశానికి బలి అయింది. మనసులు మెచ్చిన స్నేహం, తోడు యావ్వనం ఆ సంగతి కొన్నాళ్ళవరకు నాకు కూడా తెలియ లేదు.

ఒక రోజున మురళి నాతో రాలేదు డాక్టర్ విలి యంస్ యింటికి వెళ్ళేప్పటికి డాక్టర్ విలియంస్, మిసెస్ విలియంస్ పైరు కెళ్ళారు రోజ్ కూడ లేదు ఎదో పని మీద ఎటో వెళ్ళింది. వెళ్ళేప్పటికి సోఫాలో విచారంగా కూర్చుని ఉన్నది లూసీ. అంతకుముందు ఆమెను అంత ఉదాసీనంగా ఉండగా చూడలేదు. నేనంటే విశిష్టమైన గౌరవభావం ఆమెకు. బ్రదర్! అని ప్రేమతో సంబోధించేది.

నన్ను చూడంగానే ఆమె ముఖకమలం వింతకాంతులతో భాసించింది. అప్పటిపరకూ లేని ఆనందంతో లేచి ఆహ్వానించింది.

మాటల్లో లూసీ అసలు సంగతి చెప్పింది. నాలుగైదు రోజులనుండీ మురళీ రావటంల్లేదుట కూడా. అప్పుడు గాని నాకు తట్టలేదు, నాలుగు రోజులనుండి మురళి నాతో రావడం లేదన్న సంగతి.

నా ఆశ్చర్యానికి హద్దుల్లేవు. మురళి అంత పని చేసాడంటే భయపడవద్దని చెప్పాను.

'మురళిని పెళ్ళాడడం నీకు సమ్మతమేనా?' అని అడిగాను వాత్సల్యంతో.

కళ్ళ నీళ్ళు గిర్రున తిరుగగా, ఆనందాతిరేకంతో తల వూపింది లూసీ

ఆ రాత్రే మురళీతో క్యాంపులో ఆ ప్రస్తావన తెచ్చాను. మొదట నాకా సంగతి ఎలా తెలిసిందా అని అదిరిపోయాడు. చివరికి ఒప్పుకున్నాడు. క్షమించమన్నాడు నా రెండు చేతులూ పట్టుకొంటూ.

క్షమిస్తే చేసిన తప్పు, ఒప్పు ఎలా అవుతుందో మరి నాకు అర్థంకాలేదు. లూసీని పెళ్ళిచేసికోమన్నాను. 'మన వాళ్ళు కాదు, మన భాష కాదు ఎలారా!' ఏదో సణిగాడు. మురళీమీద ఎన్నడూ కోపంరాని నాకు, పట్టశక్యంగాని కోపం వచ్చింది. తలవాచేట్లు చివాట్లు పెట్టాను.

'మనవాళ్ళు, మనభాష, ఆమెను పూసుకొని షికార్లు

చేసినపుడు, వళ్ళు తెలియని ఉద్రేకంలో నీ క్రూరమైన కాంక్షలకు ఆమెను బలిచేసినపుడు, ఏమైయినాయిరా మురళీ! యిద్దరూ మనసిచ్చుకున్నారు. నీకూ ఎవ్వరూ లేరు. కాని దేశంలో యిలా నలుగురిలో నగుబాటు పాలయ్యే పని చేసావ్. విలియంస్‌కు తెలిస్తే పర్యవసానం ఎలా ఉంటుందో ఆలోచించుకో. నీకూ ఆలోచించుకొనే గలిగే శక్తి ఉన్నది.' అన్నాను సానునయంగా.

కొంచెంసేపు దీర్ఘంగా ఆలోచించు కొన్నాడు. లూసీని వివాహ మాడడానికి సమ్మతించాడు చిట్టచివరికి. లోపల వాడికీ పెళ్ళిచేసుకోవాలనే ఉన్నది. కాని భయ పడ్డాడు నేను తృప్తిగా గాలి పీల్చాను. నా ప్రయత్నం మూడువంతులు సానుకూల మయినట్లే. డాక్టర్ విలి యంస్‌తో ఈ ప్రస్తావన తేవాలి

మరునాడు డాక్టర్ విలియంస్, మిసెస్ విలియంస్ లను అడిగాను! 'మురళి, లూసీని పెళ్ళి చేసికోవడం మీా కభ్యంతరమా!' అని.

వెంటనే వారు ఒప్పేసుకొన్నారు. యింత తొంద రగా ఈ వ్యవహారం సానుకూల మవుతుందని నేను కలలో కూడ అనుకోలేదు. వారికీ మనసులో అదే ఉన్నట్లున్నది. సంతోషంతో డాక్టర్ విలియంస్ నన్ను కావిలించు కొన్నారు.

ఆయన ఇంకో సందేహం వ్యక్తం చేసారు. పెద్ద మ్మాయ్ మేరీకి కాకుండా లూసీ కెలా చెయ్యాలని. ఏ

విషయమూ రెండు మూడు రోజులలో నిర్ణయిస్తానని చెప్పారు. లూసీకి ధైర్యం చెప్పాను! 'అంతా సవ్యంగా జరిగి పోతుందిలే' ...

మర్నాడు వెళ్ళేప్పటికి విలియంస్ దంపతులు, లూసీ ఎక్కడికో వెళ్ళారు. రోజ్ మేరీ ఒంటరిగా ఉన్నది సోఫాలో కూర్చుని ఏదో చదువుకొంటూ. విష్ చేసాను నా రాకతో ఆమె సంతోషానికి అవధుల్లేక పోయింది. 'హల్లో! డియర్, నీ కోసమే ఎదురు చూస్తున్నా' నం దామె పరిగెత్తుకొంటూ వచ్చి భుజాలు కుదుపుతూ. నన్ను ఉక్కిరి బిక్కిరి చేసేసింది. ఒక సోఫాలో కూర్చున్నాను నేను. డ్రింక్ తెచ్చి ఇచ్చింది.

తరువాత నా ప్రక్కనే కూర్చుంటూ నా కళ్ళల్లోకి అదోలా చూచిం దామె.

'డియర్! ఐ లవ్ యూ!' అన్న దామె నా భుజాల మీద చేతులు వేస్తూ.

స్తంభించి పోయాను. నా కంతా అయోమయంగా తోచింది. యిన్నాళ్ళు ఆమె అదే దృష్టితో నాతో స్నేహం చేసిం దన్నమాట. ఆమెకు అలాంటి ఉద్దేశ్యాలు కలుగ టానికి దోహదం నేనే గనుక చేసినట్లుంటే నా పాపానికి నిష్కృతి లేదు. నా మనో మందిరంలో రోజ్, లూసీలు దేవతాతుల్యులు. నే నెన్నడూ అలాంటి వికృతపు దృష్టితో వారిని చూడలేదు, నాకు యిద్దరూ సోదరీ సమానులు. ఆ మాటలే చెప్పాను రోజ్‌తో.

అదీగాక నేను 'వివాహితుడ్ని' అని, అన్ని సంగతులు సవివరంగా చెప్పాను. అప్పుడప్పుడూ నేను అన్య మనస్కంగా ఉండడానికి కారణం కూడ వారిని గురించి ఆలోచనలే అని కూడ తెలియచేసాను.

రోజ్ ఈ చివరి ముక్కలు విని అదిరిపోయింది. ఆమె వదనం దుఃఖ సంద్రమే అయింది. రోజ్ మేరీ నిలువెల్లా కంపించి పోయింది. చివరికి క్షమించమని ప్రాధేయ పడ్డది నా పాదాలను స్పృశిస్తూ.

'నీవు, లూసీ నాకు చెల్లెళ్ళు. యిక ముందు గూడ నామీద గౌరవం యిలాగే ఉంటుంది కదూ!... లేకపోతే రేపటినుండి నాతో మాట్లాడవా?...' అన్నాను ఆమెను లేవదీసి, తలనిమురుస్తూ.

'ఛ... అలా ఎన్నటికీ జరుగదు. మీ మనస్సుకు తీరని బాధ కలిగించాను. మీరు హృదయపూర్వకంగా క్షమించక తప్పదు నన్ను. యిక యిక్కడికి రావడం మానుకొంటానేమో. అలా జరగకూడదు. అనుకొనినవన్నీ జరిగినాడు మానవుడు దేముడే అవుతాడు. ఆశ నిరాశల సమ్మిశ్రితమే జీవితం' అన్నది రోజ్ మేరీ కన్నీటిని తుడుచుకొంటూ.

రెండు రోజుల తరువాత విలియంస్ లూసీ వివాహానికి సమ్మతించినట్లు, సంతోషంతో వ్యక్తం చేసారు. 'మేరీ వివాహం ఏమైంది?' అని అడిగాను.

'తాను పెళ్ళి చేసుకోనంటోంది. ఆజన్మాంతం అలాగే బ్రహ్మచారిణిగానే ఉంటుందిట' అన్నారు నవ్వుతూ.

ఆయన నవ్వుతూ అన్నారేగాని, ఆమె అలాంటి కఠోర నియమానికి పూనుకోవడానికి వెనుక ఎంత విషాద గాథ దాగిఉన్నదో తెలియదు ఆయనకు.

ఒంటరిగా ఏదో అల్లుకొంటున్న రోజ్ దగ్గరకు వెళ్లాను. నన్నుచూడగానే లేని నవ్వు తెచ్చుకొని ఆహ్వానించింది.

రాత్రల్లా నిద్రలేదని చెబుతూనే ఉన్నై కళ్ళు. విచారించాను. ఈ పరిస్థితికి కారణం నేనే. నాకు తెలియకుండానే ఎన్నడైనా ఆమెను ఉద్రేకపరిచానంటే, ఆ పాపానికి తగిన ఫలం అనుభవించి తీరుతాను. అదిమాత్రం నిజం.

'ఏమిటి? అంత కఠోర నియమాన్ని అమలు పరుచబోతున్నావుట!' అన్నాను నవ్వుతూ.

'నిజమే - అబద్ధమేమీలేదు అందులో' అన్నది రోజ్ తలవంచుకొనే.

'నీకు అది భావ్యమేనా? నీ జీవితానికి ఎలాంటి అసౌఖ్యం చేకూరినా ఆ పాపం అంతా నాకు చుట్టుకొంటుంది. దయచేసి నా కోరకు పట్టుదలను వదలేసెయ్' అన్నాను.

'నా నిశ్చయం మారదు డియర్! నీ తప్పేమీ లేదు. రాత్రంతా ఆలోచించుకొనే చివరికి ఈ నిశ్చయానికి వచ్చాను' అని ఖచ్చితంగా చెప్పేసింది రోజ్.

ఆ రాత్రంతా నాకు నిద్రపట్టలేదు...ఏదో అనిర్వచనీయమైన నిర్వేదంతో, అశాంతితతో ఘడియలు గడచిపోయాయి.

అయినా ... నా తప్పేంలేదు. నా లక్ష్మిని నేను అన్యాయం చేయలేను.

లూసీ, మురళీల వివాహం జరిగిపోయింది సలక్షణంగా. యిద్దరికీ చక్కటి బహుమతులు ప్రెజెంట్ చేసాను.

పెళ్ళయిన తరువాతగాని లూసీ మామూలు మనిషి కాలేదు. 'నీవు నాకు చేసిన సహాయానికి జీవితాంతం ఋణపడి ఉంటాను అన్నయ్యా!...ఎలా తీర్చుకుంటానో! ?' అన్నది సజలనయనాల్తో, ఆనంద అశ్రురుద్ధ కంఠంతో.

'అది నా విధి చెల్లాయ్!...నా చెల్లెలుకోసం ఆ మాత్రం చేయడం గొప్పకాదులే ఇప్పుడు మురళి నీ చేతుల్లోకి వచ్చాడు. చెవులు మెలిపెట్టు...అల్లరిపిల్లాడు మరీనూ!' అన్నాను.

ఆమె కపోలాలు సిగ్గుతో ఎఱ్ఱబారినై.

నాజీ రాక్షసులు, మిత్రరాజ్యాలమధ్య ఘోర సంఘర్షణ తగ్గుస్థాయికి వచ్చింది హిరోషిమాలో అమెరికావారు బాంబులు కురిపించారు. అంతా సర్వ నాశనమైంది. ఆకాశాన్నంటే అమూల్యమైన హర్మ్యాలు, కుప్పగా కూలి తీరని నష్టం కలిగింది. లక్షలాది జనం ఆ వినాశకారి విషాగ్నికీలలో దహించుకొనిపోయారు. వేలాది ప్రజ అంగ విహీనులయి వికృతంగా తయారయ్యారు అంతులేని వింత వింత జబ్బుల పాలయారు జనం. నాజీ హంతకులు పట్టుబడ్డారు. హిట్లరు రాక్షస కృత్యాలకు, అతని అనుచరుల హంతక చర్యలకు

ఆటకట్టింది. మన మిత్రరాజ్యాలు ఐదారేళ్ళ ఘోర సంగ్రామానంతరం హాయిగా గాలి పీల్చాయి. మనదే గెలుపయింది.

మేమంతా మనదేశం తిరిగి వచ్చేసాము. డాక్టర్ విలియంస్ కుటుంబం మాతోనే మలయా వదలి మనదేశానికి వచ్చేసింది అక్కడి యిల్లు వగైరా అంతా అమ్మేసుకొని. మరి మురళి అల్లుడైనాడు కదా. అతనికోసం మనదేశం వచ్చారు.

మమ్మల్ని అందర్నీ విడుదల చేసారు నేను కూడబెట్టినది, డీమోబిలైజ్ చేసినతరువాత వారు ఇచ్చినదీ అంతా కలిపి పదివేల రూపాయల దరిదాపు, నా దగ్గర వున్నది.

నా కష్టాలు గట్టెక్కినయ్యనని అనుకొన్నాను. నా లక్ష్మిని చూడబోతున్నానని తలచుకొని నా హృదయం పరవళ్ళు త్రొక్కింది. ఆ రోజు నేను వచ్చేసేనాటి రాత్రి లక్ష్మి అనిన 'మంచిరోజులు వచ్చితీరుతై మనకు. మనంకూడ ఆనంద డోలికలలో ఊగిసలాడుతాము - అలా ఆశించాలి మరి...' అనే మాటలు నా మనస్సులో మెదలినై. ఆమె అచంచలమైన ఓర్పు మాత్రమే నన్ను ఒక ప్రయోజకుడుగా తీర్చిదిద్దింది అని మనసారా తలపోశాను.

యింటికి వెళ్ళి నా లక్ష్మిని అక్కున చేర్చుకొని 'లక్ష్మి!...హాలాహలాన్నయినా అమృతప్రాయంగా స్వీకరించే ఓర్పు, మంచితనమూ నీ వద్ద వున్నై. ఆ అపారమైన ఓర్పు సహనాలే మనకు మంచిరోజులు తెచ్చినై. మనం జీవితంలో ఏ మాత్రం సుఖపడ్డా,అంతా నీ మహిమే. కాబట్టి,

తీసుకో బహుమానం' అని చిన్న బహుమతి నిద్దామను కున్నాను.

నా బాబుకు ఐదేళ్లు వచ్చివుంటయ్. నన్ను గుర్తు పట్టడు. మరి నేనెవరో వాడికేం తెలుసు? ఎవరో క్రొత్త వాడ్ని చూసినట్లు చూస్తాడు బిత్తరపోయి. 'ఎవరూ కాదు నాన్నా!' అని లక్ష్మి చెప్పి బాబును నా దగ్గరకు పంపి స్తూంటే ఎంత ఆనందంగా ఉంటుంది!!

అమ్మవాళ్ళు తమ మనస్తత్వాన్ని మార్చుకొనే ఉంటారు. లక్ష్మికి, వాళ్ళకూ ఏమీ కలతలు ఉండి ఉండవు.

విడిపోయేముందు డాక్టర్ విలియంస్ కుటుంబం, అప్పు డప్పుడూ వచ్చి పోతుండమని కోరారు. రోజ్ మేరీ...'మా అక్కయ్యని తీసికొచ్చి చూపించాలి, బాబుతోకూడ'అని అడిగింది రోజ్, లూసీలు తెలుగును బాగా నేర్చుకున్నారు. మాట్లాడేవారు. కొంత యాసవున్నా ఫరవాలేదు. బాగానే వుండెది నాలుగేళ్ళ గాఢ స్నేహానంతరం, డాక్టర్ విలియంస్ కుటుబం మురళీలు భారహృదయాల్తో వీడ్కోలు యివ్వగా, ఇంటి ముఖం పట్టాను.

దారిలో ఎన్నో మధురాలోచనలు! భవిష్యత్తుకు సంబంధించిన తలపు! ఇంటికి చేరాను.

అమ్మా, చెల్లెళ్ళూ సంతోషంతో, ఆప్యాయతతో, ఎదురొచ్చారు. అవి, యివీ అడిగారు. నా లక్ష్మి బాబుల

కోసం వేయి కళ్ళతో గాలించాను. చివరికి ఆత్రుత అణచుకోలేక 'లక్ష్మి ఏది?' అని అడిగాను.

'అంతా చెప్తాం-కానీరా-యిప్పుడేగా వచ్చింది...' అన్నది అమ్మ. మిగతా వాళ్ళు బిక్కు బిక్కు మంటూ ఎక్కడివా రక్కడ వెళ్ళిపోయారు.

అమ్మ కూడ తప్పించుకొందామన్నట్లు వెళ్ళబోతోంది. నా మనసులో అనుమానం పొడచూపింది. కోపమూ వచ్చింది. అమ్మను రెక్కపట్టుకొని ఆపు చేసాను.

'ఏది!... నా లక్ష్మి ఏది చెప్పు!...'

నా కళ్ళు నిప్పులు కక్కుతున్నాయ్. ముఖం వికృతంగా ఉన్నది.

అమ్మ, అప్పటి నా ఆకృతి చూసి భయపడ్తూ, నా కళ్ళల్లోకి చూస్తూ వుండిపోయింది.

'ఊ!... చెప్పు!... లక్ష్మి, బాబు ఏరి!' అమ్మను కుదిలించి వేసాను.

'లేదు!...'

'ఎక్కడి కెళ్ళిందో చెప్పు నసబెట్టక...'

'లేదు... చచ్చిపోయి రెండేళ్ళయింది...'

నా హృదయం బద్దలయింది. నా ఆశాహర్మ్యాలన్నీ నేల కూలి సమూలంగా నాశనమై పోయినై. నిలువునా కంపించి పోయాను. అంతా అయోమయంగా తోచింది. అమ్మ చెంప ఛణేల్‌మన్నది. వెనుకా ముందూ ఏమీ చూడలేదు. అమ్మను వదలలేదు. తేరుకొని అడిగాను.

'ఎందుకు చచ్చిపోవాల్సి వచ్చింది...నిజం దాచావో అందర్నీ చంపేస్తాను'

'అందరూ ఎలా చస్తారో అలాగే చచ్చింది...'

'ఏమయింది వివరంగా చెప్పు!'

'జబ్బు చేసింది.'

'బాబుకూడా జబ్బు చేసిందా? వాడేడీ?'

యింతలో బాబే అటు వచ్చాడు, ఐదేళ్ళ కుర్రాడు ఒంట్లో సత్తువలేదు. కళాకాంతులు అసలే లేవు. చిక్కిపోయి వున్నాడు. సరయిన గుడ్డలు కూడా లేవు.

అమాంతం వెళ్ళి వాడిని ఎత్తుకుని హృదయానికి హత్తుకొన్నాను.

వాడు వుక్కిరి బిక్కిరయి పోయాడు. ఆ కాస్త వాత్సల్యానికే తబ్బిబ్బై పోయాడు. యింతవరకూ ఒకసారి ఎవరయినా అలా చేరదీసారో లేదో.

మళ్ళీ అమ్మను నిలదీసి అడిగాను.

'మందులు ఎందుకు యిప్పించలేదు. డబ్బు వస్తూనే వున్నది గదా.'

'ఆ కాస్త డబ్బు ఎన్నింటికి వస్తుంది పెదమ్మాయ్ నెక్లెసు చేయించుకొందా!'

'ఛీ!' అని వుమ్మేసాను. 'సిగ్గుండాలి. జబ్బుచేసి ఒక వైపు చచ్చిపోతుంటే మందులు ముందా? అలంకారానికి నెక్లెసు ముందా? సిగ్గులేదూ!'

యింకా నానా తిట్లు తిట్టాను.

మనసున్న వికలమై పోయింది. బాబును తీసికొని కాలవగట్టుకు వెళ్ళాను.

రంగయ్య పంతులు ఎదురు పడ్డాడు. 'సరిగ్గా అన్నం అదీ పెట్టేవారు కాదట. ఒక్కసారి అమ్మ కొట్టను కూడా కొట్టేదట లక్ష్మిని. సగం ఆమె పెట్టేబాధలకే జబ్బు వచ్చిందట. మందులు యిప్పించమని తనూ ఎన్నోసార్లు బలవంతం చేసినా వినలేదుట.' డబ్బు లేదు. మాకు చేతకాదు అని విదిలించేసట

లక్ష్మి పోయిన తరువాత, వాళ్ళను తిట్టని వాళ్లు లేరుట. అన్నీ వివరంగా చెప్పాడు.

నా భవిష్యదాలోచనలన్నీ చెల్లాచెదురయి పోయినై. నే నెవరికోసం, దేశాలు తిరిగి డబ్బు సంపాదించుకొచ్చానో, వారు దూరమై పోయారు. యిక ఆ పిల్లాడ్నికూడ, ఆ రాక్షసుల చేతుల్లో పెట్టే ఎప్పుడో ఒకప్పుడు వాడు కూడ లక్ష్మి దగ్గరకే వెళ్తాడు నా బాబును అలా అన్యాయం చేయను! ఈ నరరూప రక్కసులకు దూరంగా వాడ్ని తీసికొని వెళ్ళిపోతాను.

నా దగ్గర డబ్బు ఎంత వున్నదో తెలిసికోవాలని ఎన్నో ప్లానులు వేశారు. నానా తిట్లు తిట్టాను. ఒక్క చిల్లిగవ్వ యివ్వను పొమ్మన్నాను. 'యిక ముందు మీకూ, నాకూ, ఎటువంటి సంబంధం వుండదుపొండి! అని మర్నాడే బాబును తీసికొని వచ్చేసాను! మీ పాపానికి పరిహారం చెల్లించుకొనే రోజు రాకపోదని చెప్పి.

మురళి దగ్గరకు వచ్చాను. నా అవతారాన్ని, నా చేతిలోని ఎముకల గూడయిన నా బాబును, చూచి వాడు నిర్ఘాంత పోయాడు.'

'ఏమిటి మూర్తీ - ఏమిట్రా ఈ వాలకం?' అన్నాడు నన్ను కుదిలించి వేస్తూ.

అంతా సవిస్తరంగా చెప్పాను. డాక్టరు మిసెస్ విలియంస్ చాల బాధపడ్డారు. రోజ్‌మేరీ, లూసీల బాధను వర్ణించలేను. మురళీ చేతులు పట్టుకొంటూ 'ఈ నా బాబు భవిష్యత్తు నీవు తీర్చిదిద్దాలిరా' అన్నాను. మురళీ ఒప్పుకొన్నాడు.

లూసీ ఆ రోజు 'నీ ఋణాన్నెలా తీర్చుకోగలనన్నయ్యా?' అన్నది.

ఇప్పుడు...'నా బాబును ఒక మనిషిగా, ఒక ప్రయోజకుడుగా తీర్చిదిద్ది, నీ కోరిక తీర్చుకో చెల్లాయ్...'అన్నాను. ఆమె కూడ అంగీకరించింది.

రోజ్‌మేరీ నా పరిస్థితికి ఏడ్చింది. 'బాబును వదలి మీ రెక్కడికి వెళ్తారు?' అన్నది. నేనూ లక్ష్మిని అనుసరిస్తానేమోనని భయపడ్డది రోజ్.

'నా మనసేం బాగో లేదు మేరీ, నీ వనుకొన్నట్లు, నేనేమీ అలా చేయనులే. అయినా నేను ఉండి, ఏమి అనుభవించాలిసింది ఉన్నది కనుక!...' అన్నాను.

'మేరీ అదిరిపోయింది. 'అలా జరుగకూడదు... మీరు

ఉండాలి. మీ బాబును అ⁻ధను చేయడం భావ్యంకాదు!'
అన్నది.

'నేనేమీ ప్రాణత్యాగం చేయను మేరీ...నా మన శ్శాంతికోసం దేశాలు తిరిగివస్తాను. అంతే, అని మేరీకి వాగ్దానం చేసాను.

అందరి దగ్గర సెలవు తీసికొని, ⁻ దగ్గర డబ్బు అంతా మురళీకి యిచ్చివేసి, కొంతడబ్బుతో వచ్చేసాను దేశాలన్నీ తిరిగాను. పుణ్యక్షేత్రాలన్నీ సందర్శించాను. చివరికి తిరిగివచ్చి, ఇక్కడ ఈ ప్రశాంత వాతావరణంలో ఈ కుటీరంలో కాలం వెళ్ళబుచ్చుతున్నాను!! అని దీర్ఘంగా నిట్టూర్చారు మూర్తి గారు

వారి సందీర్ఘ, విషాద భయంకర జీవితగాథను విని నా మనస్సులో కలకలం బయలుదేరింది. వారియెడల నా సానుభూతి, గౌరవం, యినుమడించినై.

'మురళి...నా ప్రాణ స్నేహితుడు. మాట తప్పేవాడు కాదు. వాడిని స్వంత కొడుకు మాదిరిగా పెంచాడు ఒక ప్రయోజకుడిగా చేసాడు. నా కిప్పుడు ఏ దిగులూ లేదు. నా మనస్సు తృప్తిగా వున్నది.'

మూర్తిగారు తృప్తిగా కళ్ళు మూసుకొని దీర్ఘమైన నిట్టూర్పు విడిచారు. మూర్తిగారి చేతులు పట్టుకొన్నాను. అలాంటి లోకాతీతుడైన మీ ప్రాణ స్నేహితుడు మురళీ గారిని, మీ బాబును, కలుస్తాను. నాకా భాగ్యం కలిగించండి!...నా మీద దయవుంచి' అన్నాను.

మూర్తిగారు చిన్న చిరునవ్వు నవ్వారు. 'అంతా ఇక్కడే ఉన్నారు నాయనా... నా బాబు. మురళి, నాకు కావాల్సిన వారంతా, నాకు దగ్గర్లోనే ఉన్నారు. నాకేం దిగులు...' అన్నారు అనుకంపతో.

నాకేం పాలుపోలేదు.

'నాకేం తెలియడం లేదు బాబుగారూ! వివరంగా చెప్పండి!' అన్నాను.

'అవునోయ్ - నా మురళీ, నా చిట్టితండ్రీ, లూసీ, మేరీలుకూడా యిప్పుడు అంతా యిక్కడే ఉన్నారు. నువ్వు నా బాబువే నాన్నా!...' అన్నారు నన్ను హృదయాన చేర్చుకొంటూ.

నేను స్తంభించిపోయాను. నేను కూర్చున్నచోట భూమి విచ్చిపోయి రసాతలానికి కృంగిపోతున్నట్లు భయంకరమైన అనుభూతిని పొందాను ఎదురుగా పర్ణశాలలా మూర్తిగారి కుటీరం, చుట్టూ ఆహ్లాదకరమైనతోట, సుందర ప్రకృతి లావణ్యం, ఏమీ కనుపించడంలేదు. అంతా శూన్యంగా గోచరించింది. పూర్ణచంద్రుని కిరణస్రోతస్విని, పిల్లయేటి ముహుర్ముహురావం, వాటన్నిటికీ అతీతుడినై, చేష్టలుడిగి, స్తంభీభూతుడ్ని అయిపోయాను.

'నాన్నగారూ!' అని పెద్దపట్టున అరుస్తూ, ఆయన పాదాలమీద పడిపోయాను.

'అవును బాబూ! నేను నీ తండ్రినే... ఆ అభాగ్య

డిని నాన్నా! యిప్పటివరకు మీ తల్లిగా నిన్ను పెంచి, వాత్సల్యామృతంతో పెద్దచేసిన, ఆమె జానకి కాదు. ఆ నాటి లూసీ బాబూ!... మీ నాన్నగా నిన్ను యింతటి వాడిని చేసిన ఆయన నా ప్రాణ మిత్రుడు మురళిరా!... ఈ నా కుటీరంలో నాతో పాటు ఉంటూ, ఆజన్మ బ్రహ్మచారిణిగా కఠోర నియమం పుచ్చుకొన్న, ఈ కరుణాదేవి, ఆనాటి భగ్న ప్రణయిని రోజ్ మేరీ. ఆనాటి రోజ్ మేరీ, లూసీలకు, ఈ నాటి ఈ త్యాగమూర్తులు జానకీ, కరుణాదేవీలకు, ఏమీ సాపత్యం లేదు తండ్రీ!... అంతా నీ కోసం పేర్లు మార్చుకోవాల్సి వచ్చింది. రోజ్ నేనిక్కడ అజ్ఞాతంలో నివాసం ఏర్పరచుకొన్నాక తాను, నామీద తన అచంచలమైన భక్తి తత్పరతలకు, అభిమానానికి తార్కాణంగా, నాకు సపర్యలుచేస్తూ, నాతోనే ఉంటూ వచ్చింది. ఆమె జీవితం యిలా అధోగతి పాలుగావడం నా మూలంగా నే. డాక్టర్ విలియంస్, మిసెస్ విలియంస్, అకస్మాత్తుగా పదేళ్ళ క్రితం హృద్రోగంతో, చనిపోయారు.' అంటూ నన్ను వాత్సల్యంతో లేవదీసారు.

నేను తేరుకొనే లోపలే గలభాకు అంతా లేచారు జరిగినదంతా తెలుసుకున్నారు.

'అవును బాబూ! మీ నాన్న ఆయనే... ఆయన కోరిక ప్రకారం, నిన్ను పెంచే బాధ్యత నేను తీసుకున్నాను. మీ తల్లి జానకి కాదు, ఆమె ఎన్నడో మానవుల కఠోర అంతరాత్మలకు, వికృత అమానుష చేష్టలకు బలి అయిపోయింది. ఈమె ఆనాడు మలయాలో వివాహమాడిన

లూసీయే. పెంచి పెద్దచేసింది మేమైనా, నీవు యిప్పుడు సంతోష పెట్టాల్సింది, ఈ మీ నాన్ననూ, ఆయనకోసం మీ అమ్మ రూపంలో సేవలు చేస్తున్న ఈ కరుణాదేవిని.' అన్నారు మురళిగారు.

ఆయన పాదద్వయంపై వాలిపోయాను. ఆయనపై పైభక్తి ప్రపత్తులతో ఉబికి వచ్చిన కన్నీటి కడలితో, ఆయన పాదయుగ్మాన్ని ప్రక్షాళనం చేసాను.

నాకు అత్యంత ఆప్తులయిన కరుణాదేవి ... జానకీ దేవీల వదనాలలో శుభ్రజ్యోత్స్నలు ప్రతిఫలించినవి. మురళీ గారు నన్ను లేవనెత్తి...ఆప్యాయతతో తల నిమిరారు

అందరివైపు ఆనందంతో, తన్మయత్వంతో, అమాయ కంగా చూస్తూ, సజల నేత్రాలతో నిలబడిపోయాను.

రేరేడు శీతల కిరణపుంజంతో నా హృది పులకిం చింది. పిల్లయేటి ఆ నిశ్శబ్ద నిశీథంలో మధురగానాన్నాలా పించింది. ఎక్కడో చెట్ల గుబుర్లలోని కోయిల కలకలనాదం మృదుల మధురంగా, కర్ణపేయంగా, దిక్కులు వ్యాపించింది.

మాధవీలత చిరు పవనానికి పులకించి జల జల లాడింది

ముద్దగులాబి, మల్లెపొదలు, మధుసౌరభం వెద జల్లుతూ, సంతోషంతో ఒళ్ళు విరుచుకున్నై.

... ~ ...

## ఎంట్రెన్స్ ఫీ...

వాచీలో సెకనుముల్లు పరుగెత్తుతూనే ఉంది చిటుకు చిటుకు మంటూ, ఏదో మునిచుకుపోయినట్లు

క్షణ క్షణం టైం చూసుకొంటూ బెదరడమే కాని, వాన మాత్రం తగ్గుముఖం పట్టేట్లు లేదు.

•అబ్బ. పాపిష్టి వాన. ఇది కూడ యిప్పుడే రావాలా!

వెధవ ముసురు ఇంకొక పావుగంట తర్వాత పట్టినా బాగుండేది! ఆలస్యంగా వస్తే దాని సొమ్మేం పోయేది?

మరో మరో పనయితే అలాగే ఆగిపోయేవాడు తను. కాని....

కాని వసంతను పిక్చర్‌కు యిన్వాయిట్ చేసాడు. అదీ లాస్ట్‌డే జెర్రీలూయిస్ 'సిండర్ ఫెల్లా'. వసంత ఈ పాటికి వచ్చే వుండాలి థియేటరుకు.

నామతిమరుపు యిదయిపోనూ! పోనీ నేనేదో మనసు సరిలేకఎవరో చెప్పలేదనుకోండి. మీరన్నా 'వసంత ఎవరు బాబూ, అలా అసందర్భ ప్రేలాపన చేస్తారేం!'అని అడగక్కర్లేదూ!. సరే బాగానే ఉంది నాకు తగ్గ వాళ్ళే మీరునూ!!

వసంత మా ఆఫీసులో టైపిస్టండీ! కొత్తగా అప్పాయింట్ అయింది లెండి!

నెల రోజులలోనే నాకు, ఆమెకు మంచి స్నేహమూ కుదిరింది.

మా స్నేహం చూసి ఒక్కొక్కడికి ఎంత మంట అనుకొన్నారూ!

హెడ్ క్లార్కు అప్పలస్వామి అయితే నన్ను చూస్తేనే ముఖం చిట్లించి, చేదుమందు మింగలేక అవస్థపడే రోగిష్టి వెధవలా ఏడుపు మొహం పెట్టాడు. వెధవలు. జెలసీ సార్ !

అందులో మా అప్పలస్వామికి నేనంటే తెగులు. అందరి మాదిరిగా నేను క్రోకాచింగ్ చెయ్యను అని. మిగతా చవటలంతా, వీలయినప్పుడల్లా వెళ్ళి రెండు మూడు శేర్ల చిక్కటి తంజావూరు టైరు కొట్టూనే ఉంటారు.

ఆ దక్షుడయితే విషప్పురుగు. కనిపించి నప్పుడల్లా అదోలా ముఖంపెట్టి విషం నవ్వు నవ్వుతాడు. వాడట్టా నవ్వుతుంటే మింగేయాలన్నంత కోపంవస్తుంది. స్కౌండ్రల్! వీడు నాకు జేబులో తేలు.

భుజంగరావు కయితే పాముకోరల విషంకన్న ఎక్కువే వుంది. వీనమ్ (Venom) కైనా విరుగుడుందేమో కాని, వాడికి, విరుగుడు మాత్రంలేదు బొడ్డు క్రిందకు, కదలిస్తే జారిపోయేట్లు ప్యాంటు తొడిగి, టక్ చేసి, వసంత సీటు ముందునుండి ఫోజుకొట్టూ పాతికదఫాలు తిరుగుతాడు రెచ్చెడ్ ఫెలో! వెకిలి వెధవ!! స్కాంప్!!!

కనిపించి నప్పుడల్లా వేళాకోళం చేయడమే.

యూ మైటు పుటప్ వి తా ల్డిస్? నేనిదంతా పడాలా?. వీళ్ళ అంతు తేలుస్తాను. స్వేర్ చేసినకొద్దీ నామీద రైడవు తున్నారు.

ఒకడు బావుకుంటున్నాడనే ఈర్ష్య మాత్రం కొల్లలు వీళ్ళకి. తమ అదృష్టం ఎంతవరకు వున్నది అని లేదు!

వెకిలివాళ్ళను ఎవరు లైక్ చేస్తారండీ?. నేను మంచి వాడ్ణి లెండి! బుద్ధిమంతుడ్ణి. మా వెంకటే కూడా అలాగే అంటాడు!!

అప్పుడే సెకను ముల్లు, పెద్ద ముల్లును మరో అంకె మీదకు లాక్కు పోయింది.

వసంత వచ్చివుంటుంది. పచ్చి మోసమను కొంటుం దేమో. వాన వస్తుందని కలగన్నానా? మధ్యాహ్నం ఎక్కడా మబ్బు తునక లేకపాయె. ఛీ!. ఎలాగైనా థియే టర్ కి వెళ్ళాలి లేకపోతే ఏమనుకొంటుంది? పరువు పోతుంది కూడానూ ?

యింకా పదే నిమిషాలుంది. ముసురు కొద్దిగా నన్నా తగ్గితే, ఏ రిక్షాలోనోపడి చేరవచ్చు.

హమ్మయ్య! అదృష్టం బాగానే ఉంది. వాన కొద్దిగా వెలిసింది నాలో ఆనందం పూర్తిగా వెల్లివిరిసింది.

'ఏయ్ రిక్షా. పారడైజ్ కొస్తావా?'

'ముప్పావలా యిప్పించండి బాబూ!'

మామూలప్పుడు ఆరణాల కొస్తాడు. మన అవసరం కొద్దీ, రిక్షావాలా బెట్టుకూడా జాస్తయింది.

'ఆరణాల కొస్తావా. ఎంత దూరమేమిటి ?!'

'ముప్పావలాకు పైసా తగ్గదు బాబూ! ఈ కడకెల్లి ఆ కడకు తొక్కేతలికి ప్రాణం పోద్ది. వానలో సావాలె' అప్పుడే మూడు బారలు తొక్కుకొని పోయాడు, నువ్వు రాకపోతే ఎంతలే అన్నట్లు.

ఓరినీ బెట్టుసరి బంగారంగానూ. యివాళ అన్నీ యిలాగే ఉన్నైలే. అప్పుడే అనుకొన్నా ఆఫీసులో వరండా కార్నర్‌లో వసంతతో మాట్లాడి, పిక్చర్‌కి యిన్వైట్ చేసి, 'మరి థియేటర్ దగ్గర కలుద్దామండీ. ఓకే.' అని వస్తున్నానో లేదో, బాస్టర్డ్ భుజంగం పెద్ద పెట్టున తుమ్మాడు హాఛ్' అని అప్పుడే అనుకున్నాను ఏదో విఘ్నం జరుగుతుందని

యిహ బేరమాడితే ఈ రిక్షా లోపట్టాన దొరకవు వసంత ముందు తన డిగ్నిటీ కాపాడుకోవాలంటే ముప్పావలా కాదు మూడు ముప్పావలాలయినా లెక్క చేయకూడదు.

పోయే ఆ రిక్షా వాడిని కేకేసి. తర్వాత ఆలస్యమవుతుందేమోనని, ముందే వాడి అరచేతిలో ముప్పావలా, ముచ్చటగాపెట్టి, కూలబడి, 'తొందరగా పోనియ్' అన్నాను, ముప్పావలా తగలేస్తున్నాగదా అనే ధీమాతో.

థియేటర్‌కి వచ్చేప్పటికి పిక్చర్ స్టార్ట్ అవడానికి అయిదు నిమిషాలుంది.

రిక్షా దిగి, చుట్టూ వసంతకోసం గాలించాను. అబ్బే!. లేదే ఎక్కడా!. యింకా టైముందిగా. వస్తుం దేమోలే.

జేబులోని అయిదు కరెన్సీతీసి బుకింగ్ వైపు పరుగెత్తాను.

బుకింగ్ క్లోజ్డ్ !

అంతా ముదనష్టమే యివాళ. ఐదునిముషాల క్రితం థియేటర్ జేరడమే ప్రాబ్లమ్! ఎలాగో నానా గడ్డీతిని, చేరితే, అసలుకే మొప్పం !

బుకింగే బంద్!!

ఛ! ఐదు నిముషాలుంది... మరుక్షణంలో వసంత రావచ్చు. వానకూడ వెలిసింది. వానవల్లనే ఆగి వుంటుంది, వసంతకూడ.

థియేటర్ ప్రక్క కిళ్ళీకొట్టు దగ్గరనుండి ఒకతను చేతిలో టిక్కెట్టుతో హాలువైపు పరుగెత్తాడు

ఆశతో కొట్టుదగ్గర కెళ్ళాను.

'ఏటి బాబుగారూ... లాస్ట్ టిక్కెట్టండీ. అయిదు రూపాయలు.'

రూపాయన్నర టిక్కెట్టు అయిదు రూపాయలు.

యింకేమన్నా ఉందీ. రెండు టిక్కెట్లు కావాలి. తనకు అయిదూ. వసంతకు అయిదూ... పదిరూపాయలు! ఒక్క సినిమాకు పది రూపాయలు!

'అయిదు రూపాయలే! బేరంలేదా... ఒక్క టిక్కెట్టు కంత లేడాటయ్యా...'

'ఆరు రూపాయలకు కళ్ళకద్దుకొని తీసుకొంటారు బాబూ!'

'రెంటు టికెట్లు కావాలి...'

'రెండు లేవు...అన్నీ అయిపోయాయి బాబూ... ఒకటే ఉన్నాది...'

హాతోస్మి...యిక్కడకూడా చుక్కెదురే...టికెట్టు కయిదుపెట్టినా ప్రాబ్లమ్ సాల్వ్ అయ్యేట్లు లేదు. అసలు పిక్చర్ ప్రపోజ్ చేసిన ముహూర్తం బాగుండి ఉండదు. లేకపోతే వెధవ పిక్చర్ చూడ్డానికి ఎవడన్నా ఇంత మెంటల్ టార్చరీ పడ్డాడూ!

నిరాశగా వెనుదిరిగాను మారాన, అంటే, థియేటర్‌కు ముప్పై నలభై గజాల దూరంలో ఒక కుర్రాడు ఆవారాలా వున్నాడు...బిత్తరచూపులు చూస్తూ రమ్మని సౌంజ్ఞ చేసాడు.

షో బిగిన్ చేయడానికి మూడు నాలుగు నిముషా లుంటుంది. వసంత రాలేదు...వెల్!...పోనీలే...వసంత రాకపోయినా ఒక విధంగా తెమిలినట్లే...

కాని వసంత వచ్చి తీరుతుంది. టిక్కెట్లు దొరకలేదని బిక్కమొహం పెట్టాల్సి వస్తుంది

వసంత నవ్వుతుంది! చేతకాని వాడినని నవ్వుతుంది! వెక్కిరింపుగా నవ్వుతుంది! చవటవి అంటుంది! పైకి అనకపోయినా లోలోపల. ఇది భుజంగం వాళ్ళా చూస్తే

మరీ అభాస పాలవుతుంది. ఈ సంగతి తెలుస్తే నన్ను వేళా కోళం చేయడానికి వారికి మరో టాపిక్. వెధవ యిక్కడే ఎక్కడో ఉంటాడు భుజంగం. వాడికి ఊరంతా సత్రమే !.

ఆ ఆవారా దగ్గర కెళ్ళాను.

నవ్వా ...వీడికి తెలియలేదుకదా నా సంగతి. మరి అలా నవ్వుతాడెందుకు ?

కనుబొమ్మలు ముడివేసి, 'ఏమిటి ?' అని అడిగాను సౌంజ్ఞతోనే.

వాడు యిటూ అటూ చూసాడు తర్వాత 'టిక్కెట్లు కావాలా సార్ ?' అన్నాడు.

'రెండు టిక్కెట్లు కావాలి'

'పది, టిక్కెట్టు. రెండు పదులిస్తే పదినిమిషాల్లో తెచ్చిస్తాను.'

అమ్మొబాబోయ్. టికెట్టు పదిపెట్టి సినిమానా... మైగుడ్‌నెస్ గ్రేషియస్ !!

'యింకేం బేరం లేదా. యిష్టమొచ్చినంత పెంచితే ఎలా, వీలూచాలూ లేకుండా !'

'లేదుసార్. పదికంటె తగ్గదు'

'అవసరం లేదు.' నిరాశతో వెనుదిరిగాను

'రండిసార్! ఆరియ్యండి. పదినిముషాల్లో తెస్తాను.'

'యిక్కడ లేవా. పదినిముషాల్లో పిక్చర్ సగం రీలు పూర్తి అవుతుంది.'

'లేవుసార్, యిదివరకు...ఇలా బాగానే సంపా

దించాం. కాని రెండునెలలనుండి పోలీసోళ్ళు మమ్మల్ని దగ్గరికి రానివ్వడం లేదుసార్. ఏదో మా పొట్టకూటికి ఈ పనులు చేస్తుంటే వీళ్ళు మా పొట్ట కొట్టున్నారుసార్. వాళ్ళకూడా భాగ మివ్వాలట. అలా అయితే మాకేం గిట్టు బాటవుద్ది.'

'అలాగా.'

'పది నిముషాలు నుంచోండి సార్ పరుగెత్తి కెళ్ళి తెస్తాను.'

'వద్దులే. సినిమా మొదలయిన తరువాత ఏంచేస్తాను!' అతను బిక్కమొహం పెట్టి వెళ్ళిపోతున్నాడు. బేరం తప్పిపోయిందే అని.

వసంత రాలేదు. టిక్కెట్టు వ్యవహారం ముడివడలేదు. వాన వెలిసింది

లైటిల్స్ని రికార్డు వినిపిస్తోంది.

రికార్డు ఆగుతుంది. పిక్చర్ కమెన్సవుతుంది.

వసంత రాలేదు. వస్తే ఎలా ?

యింతలో వెంకటే కేకవేసాడు. 'ఒరేయ్ శర్మా !' అంటూ–

వెంకటే మావాడే. వాడిగొంతు నాకు సుపరిచితం లెండి.

వీడూ సినిమాకేనా ? !

ఛ ! నేనూ, వసంత పిక్చర్కొస్తే యిన్ని విఘ్నాలు. టిక్కెట్టులేదు సరికదా వీడు దాపురించాడు నా పాలిట.

'ఏమిట్రా. మొహమలావుందేం.'

వెంకట్ నా మొహంమీద విట్టుతున్నాడు.

'నీ విట్టు నా మొహంలాగా ఉంది కాని, టిక్కెట్టు దొరక లేదురా.'

వెంకట్ నవ్వాడు. నవ్వడంలో యిలాగలాగ్గాదు. పగలబడి నవ్వాడు.

'అదా చిట్టీ. అలా వున్నావ్! ఎన్నిగావాలి. యిప్పిస్తాను...'

'రెండు. వసంతనుకూడ సినిమాకు రమ్మన్నాను. వస్తుంది ఇప్పుడు. వసంతనుగురించి చెప్పివుంటాను. తెలుసుగా యూ షుడ్ బి నోయింగు యిట్!'

వెంకట్ అందంగా నవ్వాడు.

'ఐసీ!.' అన్నాడు తలవూపుతూ.

'అయితే తప్పకుండా ఇప్పిస్తారా టిక్కెట్టు-ఇలా రా!' అన్నాడు నా చెయ్యి పట్టుకొంటూ.

వాడి ననుసరించాను.

థియేటర్ ప్రక్క గొందిలోకి తీసికెళ్ళాడు.

'ఒక రక్షక భటుడు స్టాండ్ ఈజీ పొజిషన్‌లో గ్రాండ్‌గా నుంచొని ఉన్నాడు.

'పోలీసు దగ్గర కెందుకురా. వానలో వసంతను సినిమాకు తెచ్చినందుకు, ఎక్సర్‌సైజ్ చేయిస్తావేమిటి! లెఫ్ట్ రైట్. లెఫ్ట్ రైట్.

సరాసరి రక్షకభటుడు దగ్గరకే వెళ్లాం. ఆయన కళ్ళ

తోనే ప్రశ్న వేశాడు. మూగనోము పట్టినట్లు, కను బొమ్మ ల్లోనే.

మా వాడు అంతకన్నాను. రెండేళ్ళు చూపించాడు. మాట్లాడకుండా సౌంజ్ఞలోనే.

'పదియ్యండి! సినిమా స్టార్ట్ అవుతుంది'

నేను నోరు తెరిచాను.

వెంకట్ నవ్వుతూ. నా జేబులో నోటులాగి అత గాడి అరచేతిలో ఉమర్చి టికెట్లు తీసుకొన్నాడు.

నోట మాట రాలేదు నాకు

యిందాక ఆవారా పిల్లాడి మాటలు చెవుల్లో మారు మ్రోగుతున్నాయ్.

'ఎందుకు రానివ్వరు?'

అసలు జవాబు యిప్పుడు తెలిసింది వెంకట్ దయ వల్ల.

'హల్లో శర్మగారూ!. ఎక్స్‌క్యూజ్ మీ! లేటయింది పాడు వాన!'

వసంత బురదను దడిసి జాగ్రత్తగా అడుగులేస్తూ నవ్వుతూ వస్తోంది, కుచ్చెళ్ళు వయ్యారంగా పైకి పట్టుకొని.

'యింకా నేనెందుకు వసంతను అకంపెనీ చెయ్ శర్మాజీ!' అంటూ, ముసి ముసి నవ్వుల్తో వెళ్ళిపోయాడు వెంకట్.

యిడియట్!

(సై

## అదో కథ

కీచురాళ్ళ గీతస్వరం - పికిలి పిట్టల పిచ్చికూతలు, అంతటా అల్లుకుపోయిన అడవిలోని అవర్ణనీయ గంభీరత, పచ్చని ప్రకృతి పిచ్చి సౌందర్యం, నాలో, భాస్కరంలో ఒక విలక్షణమైన అనుభూతిని కలుగజేసి, మా యిద్దరి మధ్య విచిత్రమైన నిస్తబ్దతను సృష్టించినై.

మనల్ని మంత్రించి సమ్మోగ్ధం గావించే శక్తి ప్రకృతికి నిస్సంకోచంగా ఉన్నది.

లేకపోతే అయిదేళ్ళ తరువాత కలుసుకొన్న మా యిద్దరం, అడవిచెట్ల అందానికి, పిల్లగాలి గానానికి, పులక ప్రకంపితులమై స్తబ్దుగా ఉండిపోము.

అందరి ఆశయాలూ ఫలించవు. అందరూ తమ జీవన దర్పణంలో ఉన్నత మాదర్శాలను ప్రతిఫలించుకోలేరు. అందుకు తగిన స్థయిర్యం, సంయమనం, దీక్ష ఉండకపోవచ్చు వారికి. ప్రతి ఒక్కరికి, తమ తమ అభిరుచుల్ని అనుభవించి.

వాటినే తమ జీవిత సర్వస్వంగా చేసుకునే స్తోమత, అవకాశం, అదృష్టం, తటస్థ పడకపోవచ్చు.

కాని తమ ఆశయాలు, ఆదర్శాలు, అభిరుచుల కనుగుణంగా, తమ జీవన పథాన్ని మలచుకొని, జీవన మాధురిని చవిచూసే కొద్దిమందిలో మా భాస్కరం ఒకడని నా అంతరాత్మ సాక్షిగా చెప్పగలను.

అయిదేళ్ళ క్రితం మా యిద్దరం విడిపోయే ముందు పడిన ఆవేదన, ఈనాటికీ నా మనోఫలకంనుండి కదల్చలేను.

భాస్కరం ఎటో వెళ్ళాడు తనకు నచ్చిన మార్గంలో. కొత్తలో ఉత్తరాలొచ్చినా, తరువాత భాస్కరం జాడ మాత్రం తెలియలేదు. నాలుగేళ్ళకు మాత్రం, యిన్నేళ్లు ఉత్తరం వ్రాయకుండా, అశ్రద్ధ చేసినందుకు తగు పాళ్లలో క్షమార్పణలు కోరుతూ ఉత్తరం వ్రాశాడనుకోండి!

ఉత్తరం వచ్చి, తీరా భాస్కరం ఎక్కడ ఉన్నదీ తెలుసుకొనిన తరువాత నా జాప్యం మరో సంవత్సరం. ఎప్పటికప్పుడు వెళ్దామనుకొంటూనే, ఏదో పనివల్ల కదలలేకపోయాను.

నా రాకతో, భాస్కరం సంతోషానికి సరిహద్దులే లేకపోయాయి. అయిదేళ్ల కాలభ్రమణంలో మా అనుభవాలు ఎన్నో ఏకరువు పెట్టుకున్నాం,

ఎన్నో చెప్పుకోగా, మిగిలిన కొన్ని మాట్లాడుకొంటూ, అప్పుడప్పుడూ దట్టమైన అడవి గంభీరతకు, నీరవ ప్రశాంతతకు, మా గంభీరతను, నిస్తబ్దతను జోడిస్తూ, సాయంత్రం అడవి అంతా శోధిస్తున్నాం.

అడవిబాట అకస్మాత్తుగా ఆగిపోయింది. కొంచెం ముందుకు పోయేటప్పటికి, అడవిలోకన్నా వెలుతురు కూడ ఎక్కువైంది.

'యింతటితో జంగల్ ఆఖరు రా భాయ్ !' అన్నాడు భాస్కరం

ఎదురుగ్గా కొన్ని గజాల దూరంలో, పెద్దకాలువ. నీరు నిండుగా ప్రవహిస్తున్నది.

కాలవ రెండు ఒడ్లు కలుపుతూ పెద్ద తాటిమొద్దు. కాలవ అవతలి వైపున కూలిన గోడలు. శిథిలమైన పూరి పాక అవశేషాలు – ఆశ్చర్యమే వేసింది.

నిర్మానుష్యమైన అడవిలో, ప్రశాంత గంభీర ప్రకృతిలో, అలా పెద్ద కాలవగాని, కాలవ ఒడ్డున యిల్లుగాని, ఉంటుందని అనుకోలేదు నేను కనుచూపు దూరంలో చిన్న ఊరు కనిపిస్తోంది. ఆశ్చర్యానికి అవధులే లేకపోయాయి.

'కాలవ ఒడ్డున కూర్చుందాం రా!' అన్నాను.

'ఊఁ!' అన్నాడు సాలోచనగా భాస్కరం.

'ఆ యింటివైపు పోదాం రారా!' అంటూ తాటి బొందవైపు వెళ్ళాడు భాస్కరం. అనుసరించాను.

కూలిపోయిన పాక గోడలు, తాటాకులు, రెండు మూడు కర్రలు మట్టిబెడ్డలు తప్ప యింకేమీ లేవక్కడ.

భాస్కరం ముఖంలో భావాలు చదవడం కష్టమే అయింది నాకు. యిప్పటివరకు ప్రశాంతంగా ఉన్న భాస్కరం ముఖంలో అవర్ణనీయమైన నీడలు తారట్లాడాయి. ... ...

'భాస్కరం !' అన్నాను.

'ఈ కూలిన గోడలుగురించి తెలుసు కోవాలని లేదూ !'

ఆశ్చర్యమే వేసింది. వింతగానే ఉంది భాస్కరం ధోరణి.

'కూలిన యింటికి చరిత్రకూడా ఉందిట్రా!' అన్నాను. మాట్లాడకుండా కాలవవైపు మెల్లగా అడుగువేసాడు.

'రా ! యిలా కూర్చో.' అన్నాడు కాలవ ఒడ్డున పచ్చిక మీద ఒరుగుతూ.

'కూలిన యింటికి చరిత్రకూడానా !' అన్నావుకదూ. ఆ మాటకొస్తే ఆ శిథిలాలకీ, ఈ గంభీర ప్రవాహానికీ, కాలవపై తాటిబొండకీ వెనుక నాకు తెలిసిన, నీకు తెలియని ఒక చరిత్ర దాగి ఉన్నది కాని ఈ చరిత్రను ఏ చరిత్రకారుడూ తన బృహత్ గ్రంథం తాలూకు పుటల్లో యిమడ్చ లేదు. కాని వీటికి కూడ పరిమితమైన చరిత్ర ఉన్నమాట వాస్తవం. ఈ మూడు చారిత్రక అవశేషాలకీ, ముగ్గురు దురదృష్టవంతుల జీవితాలతో అనుబంధముంది. వింటావా ? అన్నాడు భాస్కరం కొద్దిగా చిరునవ్వు పెదాలపై లాస్యం చేయగా.

'తప్పకుండానూ - ఇంత అడవిలోనూ ఒక చరిత్రాత్మక స్థలం దాగి ఉంటే నువ్వు చెప్పాలేగాని, నేను వినక పోవడమా !' అన్నాను ఉత్సుకత కనబరుస్తూ; సిగరెట్ వెలిగిస్తూ.

'అయితే విను!' అన్నాడు భాస్కరం ఒక మట్టి బెడ్డను ప్రవాహంలోకి విసురుతూ.

మట్టిబెడ్డ, నీటిలో వింత శబ్దంచేస్తూ కరగిపోయింది. బెడ్డపడినచోట చిన్న చిన్న వలయాలు అంతకంతకీ పెద్ద వై ప్రవాహంలో లీనమైపోతున్నాయి.

భాస్కరం బర్కిలీ ముట్టించాడు, శిధిలాలగాథను చెప్పడానికి సన్నద్ధుడై.

'ఆ యిల్లు సీతయ్యది, ఎంకిది. వారిద్దరూ ప్రస్తుతం ఈ లోకంలో లేకపోయినా, ఆ యిల్లుమాత్రం వారిదే. వారి గాథ అంతా చుట్టుప్రక్కల జనానికందరికీ తెలుసు. వారికి కావలసిన వారెవరూ ఉండేవారుకాదు. సీతయ్యకు ఎంకి, ఎంకికి సీతయ్యే కావలసినవారూ, ఆలంబనాలున్నూ. రెండెకరాల పొలంమాత్రం ఉండేది వారికి జీవనాధారంగా. ఉరకలు తీసే యౌవ్వనంలో, ఉబికే అనురాగంతో, ఎంతో ముచ్చటగా వారి జీవితం వెళ్ళిపోతోంది. సీతయ్య, ఎంకి!'

కాలువ నీళ్ళలో ఎంకి ప్రతి స్వరూపం అస్పష్టంగా కనిపిస్తోంది భాస్కరానికి భయవిహ్వాలంగా, నేత్రాంచలాల్ని కన్నీటి కెరటాలు తాకగా.

'ఆ రోజు. పదేళ్ళనాటి వానాకాలపు ఒకరోజు.

'ప్రతియేడూ ఆయేటి పంటపెట్టి ఎంకికి బంగరుగాజులు నెక్లేసూ చేయిస్తానని మాట యిస్తూ నిలుపుకోలేక పోతున్నాడు సీతయ్య.

ఈ పంటతో నైనా ఎంకికి నెకిలేసూ, గాజులు తప్ప కుండా కొనాలి. ప్రతియేడూ యిలాగే పోతోంది అని ఆ రోజు సీతయ్య పట్టణం ప్రయాణం కట్టాడు.

ఎంకికి మామంటే మా ప్రీతి. ఎంకి అంటే సీతయ్యను ఎనలేని ప్రాణం.

'బంగరు గాజులు తొడుక్కుని, నెక్లెసు పెట్టుకుంటే ఎంకి నిజంగా రంబల్లే, ఊర్వసిమల్లే ఉంటది' అనుకున్నాడు సీతయ్య. అనుకుని తృప్తిగా నవ్వుకున్నాడు చద్ది అందు కొంటూ ఎంకి కళ్ళలోకి చూస్తూ.

ఎంకి సిగ్గుల పూబంతే అయింది. సాయంత్రం మామ తన మెల్లో నెక్లెసు పెట్తాంటే, మోటు చేతులతో గాజులు ఎక్కిస్తూ తనని తాగేస్తూ చూపులు కలుపుతుంటే, మా యిదిగా ఉంటది. నెక్లేసు తగిలిస్తూ చిలిపిమామ ఊరు కుంటాడా. ఊహు. అల్లరిచేస్తాడు. మామ అల్లరి చేష్టలకు తనకేమో మా సిగ్గేస్తది.

ఽ ఽ ఽ

వానాకాలం సాయంత్రం తేమతేమగా ఉంది. దట్ట మైన మేఘాలతో నల్లగా నల్లటి గొడుగులా ఉన్నది ఆకాశం.

సీతయ్య. చేతిసంచిలో ఎంకి నెకిలేసూ, గాజులూ ఉన్నాయ్.

సీతయ్య మనసులో మధురమైన ఊహలూ, కోరికలూ వున్నాయ్.

సీతయ్య ఎంకిని గురించి ఆలోచిస్తూ తను తెచ్చే ఆభరణాల్లో ఎంకి సౌందర్యాన్ని చిత్రించుకొంటూ యింటి ముఖం పట్టాడు.

పట్టణం పొలిమేర దాటాడు. కాలచక్రం ఆరోజు పగటి సరిహద్దును దాటింది. అప్పుడే మసకమసకగా చీకటి అల్లుకు పోతోంది.

ఎంకిని తన చేతుల్తో ముచ్చటగా అలంకరించాలి. యింటికి చేరాలంటే యింకా రెండుమైళ్ళ అడవిని దాటాలి.

ఘన తిమిర నిబిడ నిశీధిని అడవిలో.

సీతయ్యలాటి వాడికది అలవాటే. అమావాస్యలాటి చిక్కటి, జీబురు దెయ్యాల్లాంటి చీకట్లోనే ఒకసారి పొద్దుపోయి యింటికి చేరాడు.

కాని యివాళ ఎందుకో ఈ భయం? సీతయ్య కొంచెం జంకాడు. అయినా ఆగలేదు. అడవి కాలిబాట పట్టాడు. సంచీనీ, నగల్నికూడా గట్టిగా, జాగ్రత్తగా పట్టాడు.

రెండడుగులు వేసాడో లేదో వానజల్లు మొదలయింది. వానచినుకులు, ఆకులపై బడి వింత శబ్దం పుట్టిస్తున్నాయ్. గాలికి పొడుగైన చెట్లు తలలూపుతూంటే ఒక క్రమ బద్ధంగా, లయగా పాట ఆవరిస్తోంది అడవిలో సీతయ్య చుట్టూ

వెధవ వానకూడ యిప్పుడే. సీతయ్య నడక వేగం హెచ్చింది. అడవి అరమైలు వెనక్కి-పోయింది. వాన జోరు ఎక్కువైంది. సౌదామిని తళుక్కు-మని చెట్ల గుబుర్లలోంచి కనుపిస్తుంటే, క్షణంపాటు పరిసరాలు, చెట్లుకనిపించి మాయ మవుతున్నాయి.

ఆకాశం ఉరుముతుంటే అడవి ప్రతిధ్వనిస్తుంది. ఎక్కడో, గుడ్లగూబ గుండె లవిసేటట్లు కేకపెట్టింది. కప్ప లరుస్తూన్నాయి బాకాల్లాగా ... ఫెళ ఫెళార్భాటాలతో అడవి చెట్టుపై ఎక్కడో పిడుగు పడింది. భూమి దద్దరిల్లింది.

సీతయ్య గతుక్కు మన్నాడు... సంచీ తడిసి పోతోంది. పంచె కండువా, తలగుడ్డకూడా తడిసి ముద్దయి పోయాయి.

మరల గుడ్లగూబ వికృతంగా అరిచింది... అనుసరి స్తూనే 'కెవ్వు'మన్న కేక భయంకరంగా దిక్కులు ప్రతి ధ్వనించింది.

'వదులు... అయ్యో... చచ్చాన్రోయ్'

సీతయ్య బేజారెత్తిపోయాడు. కాళ్ళు చిరుకంపనం పెట్టినై... ఎవరో ఆడకూతురి విదీర్ణాక్రందనం.

మళ్ళీ ఇదివరకటికన్న భయానకంగా కెవ్వుమన్నదా గొంతే సీతయ్యకు ముచ్చెమటలు పోసాయి.

చేతిసంచి సవరించుకొని, కర్ర గట్టిగా పట్టుకొని, కేక వచ్చిన దిక్కుగా కాలు సాగించాడు. కాళ్ళకు అడవి తీగలు అడ్డు పడ్తున్నాయ్.

సీతయ్య కాలికి ఏదో పెద్దు కొట్టుకొని ప్రాణం

పోయినంత పనయింది. తూగాడు. తమాయించుకుని ముందుకు పోయాడు.

సీతయ్య గుండె వేగం ఎక్కువైంది. కన్ను పొడుచుకున్నా ఎదురుగ్గా ఏమున్నదీ కనిపించేటట్లు లేదు. చీకటిలో హటాత్సంఘటనవల్ల కలిగిన అస్తిమితతోబాటు, వాన చినుకులకు శరీరం జలదరిస్తోంది. ఎత్తెత్తి అడుగు లేస్తుంటే బురద నీళ్ళు చిందీ, అడుగు పడ్డప్పుడల్లా శబ్దం కలుగుతోంది.

మరో రెండడుగులు వేసాడు సీతయ్య. తూలాడు. కాలు జారింది. తలక్రిందులుగా ఒక గోతిలో పడ్డాడు.

తలగుడ్డ స్థాన భ్రంశం పొందింది. సొమ్ముల సంచీ సీతయ్య పట్టునుండి స్వాతంత్ర్యం సంపాదించింది. నడుం జివ్వుమనేట్లు పడిన సీతయ్య శరీరానికి వాన, బురదలో ఏదో మెత్తగా అస్పష్టంగా. స్పర్శానుభూతి కలిగింది

దెబ్బనుండి కోలుకొని, తడుముకొంటూ వెతుక్కుంటూ లేవబోయాడు, తను బయలుదేరిన ముహూర్తాన్ని తిట్టుకుంటూ.

అకస్మాత్తుగా సీతయ్యమీద వెలుగు కిరణాలు పడ్డయ్. అన్నీ ఆశ్చర్య జనకమైన సంఘటనలే జరుగుతున్నయ్ సీతయ్యకు ఇవాళ. చిమ్మచీకటిలో వెలుతురురావడం మరొకటి.

ఆ వెలుతురే ఎదురుగ్గా యస్. ఐ గంగరాజునూ, ముగ్గురూ పోలీసులను పరిచయం చేసింది.

అదే వెలుతురు తన ప్రక్కన మెత్తగా తగిలిన ఒక

ఆడ మనిషి వికృతమైన శవాన్నీ పరిచయం చేసింది. శవం గొంతుమీద గాట్లు, రక్కుళ్ళు. రక్తం చిమ్ముతోంది.

బురదగుంటలో బురద నీళ్లు ఎర్రగా వసంతం నీరు లాగా ఉంది కళ్ళు చెదరేటట్లు... ఎంకి నెకిలేసు, గాజులు వసంతం ఆడుకొంటున్నాయ్ ఆ నీటితో.

ప్రక్క ఊళ్ళో కేసుపనిమీదవచ్చిన యస్. ఐ. గంగ రాజుకు, సీతయ్య విన్నట్లే కేకవినిపిస్తే అటువచ్చాడు.

గంగరాజు దృష్టిలో సీతయ్య దోషి !

సీతయ్య వేడుకోళ్లూ, సంజాయిషీలూ వ్యర్థమే అయ్యాయి. గంగరాజు అనుమానాన్ని ఎంకి నెకిలేసూ, గాజులూ మరీ ధృవపరచినై. సీతయ్యను తలా ఒలుగూ బాదారు సీతయ్య ఘొల్లుమన్నాడు.

తను అలాంటి వాడిని కానన్నాడు. తల బాదు కున్నాడు.

లాభమే లేకపోయింది.

సీతయ్యను కటకటాల్లో ఉంచారు... ఎంకి దుఃఖానికి హద్దులేకపోయింది. జైలు అధికారులను ప్రాధేయ పడ్డది మామ విడుదల గురించి. ససేమిరా అన్నారు.

గంగరాజు ప్రమోషనుకు సీతయ్య కేసు ఒక సోపానం! ... అడవిలో ఆడమనిషిని చంపి నగలు చోరీ చేసి నందుకు సీతయ్యకు మరణశిక్ష !

సీతయ్యను చంపారు... బలవంతంగా భయంకరంగా, గుడ్డిగా.

న్యాయస్థానానికి దృష్టి లోపం వచ్చింది. రేచీకటి...
దోషి నిర్దోషిగానూ, నిర్దోషి దోషిగానూ కనుపిస్తారు దానికి.

సీతయ్యను ఉరితీసిన రెండు నెలలకు, యస్. ఐ. గంగరాజుకు బ్రేవోగా ఆ సంవత్సరం స్పెషల్ ఎవార్డ్ వచ్చింది.

ఎంకి దుఃఖ మహాసముద్రమే అయింది.

౨ ౨ ౨

ఒకరోజు సాయంత్రం — సీతయ్యను ఉరితీసిన రెండు నెలల తరువాత ఒకనాటి బరువైన సాయంత్రం — ఆకాశం మేఘాల్తో బరువుగా నిండుగా ఉంది.

పొలంనుండి వస్తున్న ఎంకికి కాలవ అటువైపున తన యింటి ప్రక్కగా గంగరాజు వస్తూ కనిపించాడు. ఎవార్డు వచ్చినప్పటినుండి కొత్త కేసులకు తెగ తిరుగుతున్నాడు గంగరాజు.

ఎంకి కళ్ళు నిప్పులే చెరగాయి. అసలే ఉబికి వచ్చే వక్షం ఉద్రేకంతో మరింత ఉబికింది.

మామను పొట్టన బెట్టుకుంది ఈ వెధవే!...వీడిని తను పొట్టన బెట్టుకుంటుంది...వీడిని ఒక ఆట ఆడిస్తుంది.

మామ లేడు...మామ లేనప్పుడు తను ఉన్నా లేక పోయినా ఒకటే. తను పోయే ముందు గంగరాజుతో చెలగాటం ఆడుతుంది. తనమామ ప్రాణాలతో చెలగాటం ఆడాడు వీడు.

ఎంకి క్షణం ఆలోచించుకుంది. త్వరగా అడుగు వేసింది. అప్పుడే చిటపట చినుకులు మొదలవుతున్నాయ్.

అటు గంగరాజు తాటి బొందపైకి ఎక్కాడు. ఎక్కి రెండడుగులు వేసాడో లేదో యిటు ఎంకి కూడా ఎక్కింది.

తాటి మొద్దు క్రింద కాలవ ఎంకి లాగానే బిగువుగా, నిండుగా ఉంది. ఎంకి పొంగే యౌవ్వనంలాగానే ప్రవాహం పొంగి పొరలుతోంది.

ఎంకి కాలు జారి కెవ్వుమన్నది ప్రవాహంలో పడ్తూ. అది చూసిన గంగరాజు చూస్తూ చూస్తూ ఒక ప్రాణాన్ని ప్రవాహానికి వదలివేయ దలచుకోలేదు.

రక్షించడానికి వెంటనే నీటిలో దుమికాడు. ఒడ్డుకు తెచ్చాడు ఎంకిని, ఈదుతూ.

ఎంకి చామనచాయ శరీరంపై అనాచ్ఛాదిత భాగాల మీద నీటిబిందువులు ముత్యాల్లా మెరిసి, జారిపోతున్నాయ్. చలికి కుంచించుకుపోతూ సిగ్గులమొగ్గే అయింది ఎంకి.

తడిగుడ్డల్లో ఎంకి పరిపూర్ణ యౌవనపు మిట్టపల్లాలు గంగరాజును వెర్రెత్తించినై. దానికితోడు వాన జోరెక్కువైంది.

ఎంకి సంపూర్ణ యౌవ్వనం, ఆమె మార్మికదృష్టి, దానికితోడు తరుముకొంటూ వచ్చిన వాన, ఎంకితో బాటు

గంగరాజును ఎంకి పాకలోకి దారితీయించినై ... గంగరాజు శరీరంలో అగ్నిపర్వతమే బద్దలయింది.

ఎంకి గంగరాజుకు దాసోహమే అయింది.

౹ ౹ ౹

ఆనాటినుండి ఎంకికి గంగరాజే దాసోహమయ్యాడు.

ఎంకి సమక్షంలో, పెళ్ళాం, బిడ్డలు, ఉద్యోగధర్మం, నిద్రాహారాలు, ఏమీ లెక్కలోకి రాలేదు. యింటి వ్యవహారాలు పట్టించుకునే వాడేకాదు. ఉద్యోగ వ్యవహారాల్లో మితిమీరిన అశ్రద్ధ ఎక్కువైంది.

తప్పుడు కేసులు పట్టిస్తే యింక్రిమెంట్లు, అవార్డులు, దానంచేసిన అధికారులు, అసలు ఉద్యోగధర్మానికే విముఖుడైన గంగరాజును ఇక నీ అవసరంలేదు పొమ్మన్నారు.

ఎంకి మదుపులో మరిగిన గంగరాజు, వున్న నాలుగు డబ్బులు పైలా పచ్చీసుగా తగలేసాడు. గంగరాజు ఉద్యోగం ఒక శుభముహూర్తాన ఊడి కూర్చుంది.

ఇంట్లో కొడుక్కి కలరావచ్చి ప్రాణం పోతుంటే, గంగరాజు ఎంకి యౌవ్వనంతో సరిక్రొత్త ప్రయోగాలు చేస్తున్నాడు.

ఒకనాడు ఇంటికి చేరేటప్పటికి, పిల్లాడి మృతశరీరం గంగరాజుకు స్వాగతం పలికింది. పెళ్ళాం కంటికీ మింటికీ ఏకధారగా ఏడిచింది. నలుగురూ నాలుగూ పెట్టారు.

ఎప్పుడో పెళ్ళాం నగలు రామ్‌లాల్ శేఠ్‌కు తెగ నమ్మిన గంగరాజు, ఏమయినా, అవశేషా లున్నయ్యేమోనని వచ్చాడు. పెళ్ళాం బోసిమెడ గంగరాజును వెక్కిరించింది. నిరాశే అయింది ఇల్లు నరకమే అయిపోయింది. ఉద్యోగం లేదు.

మనశ్శాంతికి ఇంటికి వస్తే, ఎంకిపాకకు తాళం వేసి ఉంది.

ఎంకి ఇంటిచుట్టూ తిరగని క్షణం లేదు. గంగరాజు రాకపోకలు, అతని అస్తిమితం, ఆనాటి ముద్దు, నిర్జీవి అయినా చూస్తూనే ఉంది. ఉరకలు తీసే ఎంకిలాంటి, ఆ ప్రవాహమూ చూస్తూనే ఉంది.

రోజులు గడచినా ఎంకి జాడ శూన్యమే అయింది. గంగరాజు పిచ్చివాడే అయినాడు.

ఇల్లు గుల్లయింది తిండికి మెతుకులు లేవు. పెళ్ళాం ఎముకలగూడే అయింది. గంగరాజూ మంచం పట్టాడు.

ఎంకి తృప్తితో మామను తలచుకొంది! 'మామను బలవంతాన చంపావు. ఇప్పుడు భగవంతుడు నిన్ను చంపుతాడు లేరా పాపిష్టి గంగరాజూ' అనుకొంది.

'మామా నన్ను క్షమించవూ ? నీకోసమే నేను చెడిపోయాను. నీకు జరిగిన అన్యాయానికి పగతీర్చుకుందామంటే ఇదే దారి. ఇంకో దారే కనబడలేదు. నాకెంతో ప్రాణమిచ్చేవు. నేనూ నీ దగ్గరకే వస్తున్నా మామా!' అన్న

అదే తాటి మొద్దుమీద నిలబడింది ఎంకి.

తన ఇంటివైపు చూచుకొని, మామను మరోసారి తలచుకొని పరవళ్ళు త్రొక్కే నిండైన ప్రవాహంలో పడి పోయింది ఎంకి.

ప్రవాహం సుడులు తిరిగింది. పెద్ద శబ్దం చేస్తూ ప్రవాహం పైకి చిమ్మింది

ఎంకిని, ప్రవాహం తనలో యిముడ్చుకొని మామ దగ్గర వేసింది

'ఇది పదేళ్ళనాటి మాటరా శేషూ!' అన్నాడు భాస్కరం నిట్టూరుస్తూ.

'ఆ శిథిలాలు ఎంకి పూరిపాకవి అనుకో. కాని వాటిని ఎంకి ఇంటివి అనేకన్నా, ఎంకివేనని చెప్పొచ్చు. కాబట్టి అది ఎంకి సమాధిరా శేషూ?' అన్నాడు గంభీరస్వరంతో భాస్కరం.

ఎంకిగాథ స్త్రీ మనస్తత్వానికి నిర్వచనం. ఎంకి చరిత్రతో స్త్రీ అంటే ఏమిటో అంతు పట్టింది నాకు.

స్త్రీ బుద్ధి ప్రళయాంతకః.

మనస్సులో కలవరం అణచుకొని అన్నాను 'చీకటి పడ్తోంది. పోదాంరా, లే' అని.

భాస్కరం లేచాడు. కాలవ దాటి అడవిదారి పట్టాం ఇద్దరమూ. అడవిదారి మలుపులో ఆగి వెనుదిరిగి చూసాను, శిథిలాల్లోని ఎంకి సమాధివైపు.

'ఇక మరచి పోవోయ్. ప్రతిదానికీ అంత ఆలో చించకూడదురా. ఈ చెవినవిని ఆ చెవిన వదలివెయ్యాలి. దిస్ ఈజ్ లైఫ్ శేషూ. దటాస్ ఇట్. అదో కధ. అంతే. కదంటే కథే. పద. చీకటి కూడానూ!' అంటూ లేక లాగాడు భాస్కరం.



## విరహావరోహణం

ఆమె చంద్రునికై పరితపించు చకోరి. విరహతప్త హృదయ.

ఎన్నటికీ ఆ వెన్నెల జోదు ఉదయించడాయె! ఎప్పటికి ఉదయించను? ఎన్నటికి తన అమృత కిరణాల చుక్కలు ప్రసరించను?

పశ్చిమాద్రి దాటి వచ్చునా! - ఆమె మనసిచ్చిన మదనుడు పశ్చిమానే, సప్తసముద్రాల కావల అమెరికాలో శాస్త్ర పరిశోధన చేస్తున్నాడు. ఆమె భర్తృక, విరహతాపానికి ఉష్ణోగ్రత ఎంతో లెక్క-కట్టుకుంటున్నది ఇట - సప్త సముద్రాల ఈవతల – భరతఖండాన – ఆంధ్ర దేశపు రాజధానీ నగరాన - పిల్లగాలిలో – డాబాపై –

మూడు వత్సరములు గడచె–విరహాగ్ని ఆమెను దహియించె. మదనుడి విరిశరాల్లా అతడు ఎయిరో గ్రాములు వ్రాసివేస్తూనే వున్నాడు. మన్మధ బాణాల్లాంటి అతడి పత్రాలు నెమ్మదిగా హాయిగా తాకె నామెను. ఆమె విరహోత్కంఠిత. ఆమె నేత్రాలు హమేషా చంచలాలు.

ఆమె హరిణేక్షణ విరహంలో ఎటూ తోచక పోస్టు మ్యాన్ కొరకు తమాషాగా చూస్తూ ఉంటయ్ ఆమె నేత్రాలు.

అదిగో! రానే వచ్చె నా రోజు! ఆమె ఆశలుఫలించే బంగారు రోజు. ఆమె నిరీక్షణకు ఫలితం దక్కే- యుగాల కావలి ఒకా నొక దివ్యమైన రోజు. యిన్నాళ్ళు విరహ తాపంలో మరిగిపోయిన ఆమె జ్వలిత హృదయం పరవ శించే సుదినం - ఆమె యిక విరహిణికాదు.

ఆనాటి ఉదయం—మెసెంజర్ వచ్చాడు-'టెలిగ్రాం!'

తామర తూడుల్లాంటి ఆమె నాజూకు హస్తాలు ఆ మాటతో కంపించినవి. ఆమె గుండె గూళ్ళలో లబ్ డబ్ ల సంఖ్యత్రిగుణీ కృతమైనది. కంపిత హస్తాలతో సంతకంచేసి టెలిగ్రాం విప్పింది.

'ఆహా...ఏదీ ఆ భయం? - ఏదీ ఆ విరహతాపాగ్ని జ్వాల!...ఆమె పరిసరాలే మరచింది. ఎండ ఏది? చకోరికి వెన్నెల రాజు సందర్శనం కాబోతోంది. ఆతడు పశ్చిమాన బయలు దేరాడు - సముద్రాల కావలివైపున, సకల విద్యా పారంగతుడై, విదేశ వేషధారియై, తనను తన ప్రియురాలిని పోషించుకొనుటకు మూడువేల రూకల నెలసరి ఆదాయం కొరకు అర్హత సంపాదించి - విమానంలో –

అతడు వస్తాడు సాయంత్రాని కల్లా - చంద్రుడూ ప్రభవిస్తాడు యిహ జగమంతా వెన్నెల నురుగులే-

ఆమె హృదయంలో కోటికోట్లకు మయూరాలు నాట్యమాడినవి -

లక్షకోట్ల పరభృతాలు పరవశించి గానమాలా పించినవి.

శతకోటి సెలయేళ్ళ మధుర మర్మర ధ్వనులు ధ్వనించినవి.

కోటి నక్షత్రాల కాంతులు ప్రతిఫలించిన వామె హరిణేక్షణాలలో.

సవాలక్ష చంద్రకాంతు లీనిన దామె నెమ్మోము.

లక్ష గులాబీల సౌరభం, అరుణిమ సంతరించుకొన్నవి ఆమె చెక్కిళ్ళు -

సిగ్గుల నిగ్గుల మొగ్గే అయినది ఆమె - వేయి వేల సంపెంగల, పారిజాతాల, మల్లెల, మొల్లల మధుర సౌరభాల పిల్లవాయువులు వీచిన ట్లామె ఆమె పూదోటలోన. వందవేల శరత్తులు, దశ సహస్ర వసంతాలు అనుభవ ద్యోతకమయిన వామెకు.

సహస్ర పూశరాలు మదనుడి నుండి సరఫరా అయినవి.

వందలాది శహనాయీలు మధుర విపంచీ క్వాణ క్వాణ నిక్వాణాలు దశదిశల ముంచెత్తి వీనుల విందాయె నామెకు!

ఎంత హాయి!! - ఆహా ఎంత అదృష్టం!

యాంబది సితారాల మీటు వినిపించె — ఆమె మానస సాకాశాన నేక వింశతి హరి విల్లులు విరిచినవి.

వింశతి మార్లు ఆమె కాళ్ళు తడబడినవి. పదిహేను మార్లు చదువుకున్నది ఆ టెలిగ్రాంను ఆమె.

పదిసార్లు ముఖప్రక్షాళనచేసి నీవియాక్రీం రుద్ది, పెదిమలకు లిప్‌స్టిక్, గోళ్ళకు క్యూటాకును పూసుకొని ముస్తాబయినది.

యింతలో సాయంత్ర మాయె — అతడు వచ్చు వేళాయె. వెన్నెలజోడు వచ్చునా? ఎయిరోడ్రోముకు వెళ్ళుటకు ముందు అయిదారు మారులు డ్రెస్ సరిచూసుకొని కుచ్చిళ్లు సరిదిద్దె నామె.

వ్యానిటీ బాగ్‌లోని సుగంధాల చూర్ణం అద్దుకొని మిర్రర్‌లో చూచి పరవశించె...

పోర్టికోలో నాలుగడుగులు వేసెనో లేదో, మరల టెలిగ్రాం!

ఆమెకు మూడు క్షణాలు గుండియలాగిపోయె గదా!

తేరుకుని తంతి చింపి చూచె - ఆమె రెండు కళ్ళు భయ విభ్రమాలతో విచ్చుకొనియె-

సముద్ర గర్భంలో విమానం గల్లంతు — చంద్రుడు రాహు గ్రస్తం.

హా ! ప్రియా!-

ఆమె గుండియ గూడులో ఒకే ఒక్క ఆటంబాంబు ఢాం !!

నా ప్రియా ! నా ప్రియా!

కలయా! వైష్ణవ మాయయా!

'అమ్మడూ - ఎంత సేపు మొద్దు నిద్ర- లే, బావ వచ్చే వేళయింది —' అమ్మ అమ్మడికి సుప్రభాతం -

యిది కలయా? - అవును కలయే– అమ్మడి కమ్మటి భయంకర కల!

...⁘~⁘...

## అనుబంధాల సాలెగూళ్ళు

'అమ్మాయ్ శశీ... జాగ్రత్త తల్లీ. చేరగానే వుత్తరం వ్రాయండి' మూర్తిగారి కనుకొలకుల్లో కన్నీరు కదలింది.

'శశి చూస్తుందేమో! చూచి బాధ పడుతుంది తల్లి' అనుకొంటూ ముఖం ప్రక్కకు తిప్పుకొని వుత్తరీయంతో కళ్ళొత్తు కొన్నాడు.

పదిహేనేళ్లు పెంచాడు శశిని. తల్లిలేకపోయినా, ఆ వెలితి కనబడనీయకుండా, తల్లీ తండ్రీ అయి శశిని. ఈ తన చంద్రబింబంలాంటి శశిని ప్రాణాస్పదంగా పెంచాడు తను. ఇప్పుడు శశిని వదలిపెట్టి ఉండాలంటే, శశి లేని ఆ చీకటి గదుల్లో కాలక్షేపం చెయ్యాలంటే, తనకు ఎలా సాధ్యమవు తుంది? ఇన్నాళ్ళూ ఇంట్లో, తనూ, శశి, నౌకరు వెంకయ్యా మాత్రమే అయినా ఇల్లు శశి కాంతులతో వెలుగుతుండేది. ఇప్పుడు శశి వెళ్ళిపోతుంటే, వెలుతురుగూడ శశితోపాటే జరిగిపోతోంది

ఇక ఆ ఉరుమంత ఇంట్లో, ఆ లంకంత కొంపలో, వెలుతురు తొలగగా ఏర్పడిన నీడలే దిక్కు.

ఆడపిల్లయి పుట్టిన తరువాత ఎప్పుడో ఒకప్పుడు పరాయి ఇంటికి వెళ్ళక తప్పదు.

తన హృదయంలోని ప్రేమానురాగామృతాన్ని రంగరించి, పెంచి పెద్దచేసిన శశి దూరమవుతుంటే, తన మనస్సు విచార స్పందన పొందకుండా ఎలా ఉంటుంది?

తను బాధ పడ్డం గ్రహిస్తే, శశికూడ కంటనీరు పెడ్తుంది. తను నిగ్రహించుకోలేకపోతే. పిచ్చితల్లి అక్కడికి వెళ్ళినా సంతోషంగా ఉండ లేదు. బెంగపడ్తుంది కూడా

ఇంటివద్ద, బయలుదేరుతుండగా, ఇలాగే విచారగ్రస్థమైన తన ముఖ కవళికల్ని చూచి శశి అన్నది. 'మాతో బాటు వచ్చేయండి నాన్నా. ఇప్పుడు సంపాదించింది చాలు. ఇంకా ఈ కోర్టు, కచ్చేరీలూ తిగడం ఎందుకు? ఉద్యోగానికి స్వస్థి చెప్పి వచ్చి మాతో ఉండండి.'

అల్లుడు కూడా అలాగే అన్నాడు.

కాని, ఎలా. శశి చెప్పింది యదార్ధమే. ఉద్యోగం వదలినా జీవితం గడవకపోదు. సంపాదించిందీ తక్కువేమీ లేదు. అయినా ఏదో వెలితీ, అసంతృప్తీ ఉండనే ఉంటాయ్.

ఉద్యోగం చెయ్యవలసి రోజుల్లో, పనీపాట లేకుండా, కూతురు ఇంట్లో కాళ్ళు ముడుచుకు ఎలా కూర్చుంటాడు తను? అసలు బాగుండదు.

ఆ సలహాకు కూడ స్వస్థి చెప్పాడు.

'అలాకాదులే అమ్మా, ఊసుపోదు. అయినా ఉద్యోగం చేసే వయస్సూ, ఓపికా, రెండూ ఉండగా

మానేయడం అంత సబబుగా ఉండదు. ఏం చేస్తాం. పెంచిన మమత, మమకారం, అలా ఏడిపిస్తాయ్. అప్పుడప్పుడు వస్తుంటాను లే. నువ్వుమాత్రం ఉత్తరాలు వ్రాయడం మరువకు. ఇన్ని అనుభవాలు చవిచూచిన నాకు ఇది మామూలైకటవుతుంది. అంతే అన్నాడు తను అప్పుడు, కంఠం గాద్గదికం కాగా.

ఇంతలో బండి కూత కూసింది.

మూర్తిగారి హృదయంలో అది భయంకరంగా ప్రతి ధ్వనించింది తేరుకొని, ఆలోచనలను స్వాధీచేస్తే, ఏవో అస్పష్టంగా అన్నారాయన.

శశి చెయ్యి ఊపుతోంది... అల్లుడు 'వెళ్ళొస్తానండీ' అంటున్నాడు.

మూర్తిగారి నోటమాట పెగలలేదు. యాంత్రికంగా, డీలాగా తనూ చెయ్యి ఊపారు.

రైలు ప్లాట్‌ఫారమ్ దాటి ముందుకు పరుగెత్తింది. రైలుతో పాటు శశికూడ వెళ్ళిపోయింది?

అప్పటివరకు! ఫ్యానుగాలి జోరుకు ఎగిరిపోయే కాగితాల్ని పేపర్ వెయిట్‌తో అణచి పెట్టినట్లు, తన ముఖకవళికల్ని, తనదుఃఖాన్ని, తన హృదయంలో చెలరేగే ఝుంఝూ ప్రభంజనాన్ని బలవంతంగా అణచి ఆపుకొన్నాడు.

ఎవరికోసం అలా నిగ్రహించుకొన్నాడో, వారు కదలి పోయారు. ఇప్పుడు నిగ్రహం సడలి, దుఃఖం ద్విగుణీకృతంగా వెల్లువికి వచ్చింది

'దుక్ఖపడ్తారేటి బాబూ. అమ్మాయిగోరు మా సుకపడ్తారు లెండి. అబ్బాయిగోరు చాన మంచోరు!' వెంకన్న పరిస్థితికూడ అలాగే ఉన్నా, మూర్తిగార్ని ఏదో సముదాయించాడు.

కారు స్టీరింగ్ చేతిలో ఉన్నా, మూర్తిగారి మనస్సు అల్లకల్లోలంగా ఉంది.

శశి వెళ్ళిపోయింది! తననుండి యిలాగే ఒకప్పుడు, సుజాతకూడ దూరంగా, కనరాని ఏ దూరతీరాలకో కదలి పోయింది!! అలాగే అంతకుముందు అరుణ!!!

తన జీవన పథంలో అడుగుపెట్టి తనను అనురాగ సుధలో ముంచెత్తి, తన మమతానురాగాల మాధురిని చవిచూసి, పరిపూర్ణత లేకుండానే నిష్క్రమించింది శశితో ముగ్గురు.

శశి, అరుణ, సుజాత.

అరుణ. అరుణ ఆనాడు, నాటకంలోని ఏదో చిన్న అనామక పాత్రలా, తన జీవన్నాటకంలో ప్రవేశించి మధ్యంతరంగానే వెళ్ళిపోయింది.

కాదు. ఆమె వెళ్ళలేదు ఆమెనుండి తనే వచ్చాడు. కాని, ఎవరు ఎవరినుండి దూరంగా వచ్చినా. హృదయంలో జరిగే పరిణామాలూ, ఫలితాలూ, మాత్రం ఒకటే.

అరుణనుండి వచ్చేయడానికి తను మాత్రమే కారకు డయితే, సుజాత వియోగానికి భగవంతుడు కారకుడు

భగవంతుడు కారకుడు! అసలు మనచేతులు దాటి

పోయిన వ్యవహారాలన్నీ భగవంతుడి మీదే మోపు తుంటాం !!!

అలాగే సుజాతను భగవంతుడు విడదీసాడు.

సుజాత తరువాత, సుజాత ప్రతిబింబమయిన ఈ శశి, శశిలోక సహజంగా వెళ్ళింది తనను వదలిపెట్టి. తన శశే గాదు. లోకంలోని శశిలాంటి ప్రతిపిల్ల ఇలా వెళ్ళాల్సిందే. కాబట్టి శశి వెళ్ళడంలో ఎవరిప్రమేయం లేదు. అరుణను నేను, సుజాతకు భగవంతుడు. ఐతే శశి అతి సహజంగా వెళ్ళింది. ఎవరివల్ల గాదు.

మొత్తానికి తనను ఒంటరివాడిని చేసి వెళ్ళిపోయింది ముగ్గురు. అరుణ, సుజాత, శశి.

అరుణ! కాలేజీలో తనతోబాటు బి. యే. చదువు తుండేది. లక్షాధికారుల బిడ్డ. కాని ధనం వలన కలిగే గర్వాతిశయాలు మాత్రం శూన్యం ఆమెలో. ప్రతి విషయం లోనూ స్వతంత్రాభిప్రాయాలతో వ్యవహరించేది.

చక్రవాకాల స్నిగ్ధప్రేమ - కోకిలల కలకంఠం— మాధ్వీరసాల మధురిమ — గండశిలల కాఠిన్యం - వీటన్నిటినీ ఒక మూసలో కరిగించి తయారుచేసిన స్వరూపమే అరుణ.

అతి సామీప్యంలోకి వచ్చిన అరుణను చేజేతులా దూరం చేసికొన్నాను.

అమ్మ అన్నది 'ఎంత నిగర్వులైనా, ధనవంతులతో వియ్యం ఎప్పటికైనా అపాయ కరమైనదే' అని.

'ఇప్పు డేదో వుద్రేకంలో వివాహమాడినా, డబ్బున్న వాళ్ళలో వచ్చే యిబ్బందులు ఇన్నీ అన్నీ కావు బాబూ. మన పరిస్థితులకు తట్టుకోలేరు. అరుణతో సంబంధం తెంచు కోవడమే మంచిది.'

ఎందుకో - అరుణను ప్రేమించినా, ఆమె సాంగత్యాన్ని హృదయ పూర్వకంగా అభిలషించినా, అమ్మ మాటలలోని నగ్న సత్యం అరుణను తన నుండి వేరుచేసింది.

అరుణ ఎంత వేడుకొన్నా ఇక సంబంధం కలవదని నిక్కచ్చిగా చెప్పాను భారహృదయంతో.

తర్వాత అరుణ ఇంటి పెద్దలద్వారా కూడా సంప్రతింపులు జరిగినై గాని అమ్మ ససేమిరా అన్నది.

అమ్మ సిద్ధాంతంమీద గురి కలిగిన నా హృదయంలో కూడ కాఠిన్యం పేరుకొని 'అంతే' నన్నాను.

అమ్మ సిద్ధాంతం ప్రకారం—ఆమె చెప్పిన యోగ్యతలుగల సుజాతను చేపట్టాను బుద్ధిమంతుడిలా. తనలాగే సుజాత కూడా మధ్య కుటుంబంలోనుండి వచ్చింది.

తీవల ఆలంబన గుణం, చంద్రుడి వలయాకృతి, ఆకుల లేతదనం, లేతరెమ్మల వంపుసొంపులు, హరిణేక్షణాల చాంచల్యం, వీటన్నిటి మిళిత స్వరూప స్వభావాలే సుజాత.

సుజాతతో వివాహమయింది. నా బి. యల్. కూడా పూర్తయింది. ప్రాక్టీస్ పెట్టాను. అరుణనుండి దూరంగా వచ్చేసాము.

సుజాత ప్రతిబింబమే శశి. సుజాత ఎంత త్వరగా నా మనస్సు నాక్రమించి అరుణను మరచేటట్లు చేసిందో అంత త్వరలో నన్నూ, శశిని విడిచి దూరంగా, శాశ్వతంగా వెళ్ళింది.

జబ్బేమో తెలియదు. చిన్న జ్వర మొచ్చింది. హాస్పిటల్లో చేరిస్తే రక్తం లేదని ఏవో యింజక్షన్లిచ్చారు. కాని ఇంజక్షన్లు సుజాతను బ్రతికించలేక పోయాయి. ఒకరోజు రాత్రిలో సుజాత ఋణానుబంధం తీరిపోయింది. అరుణను వదలుకొన్నాను- సుజాతను కావాలనివిడదీశాడు దేవుడు.

అరుణను ఆశపెట్టి, మోసం చేసినందుకు యిలాంటి శిక్ష విధించాడేమో మరి !

తరువాత శశి, ఉద్యోగమూ నా లోకమయింది. శశిలోనే సుజాత ప్రతిబింబిస్తుంటే, శశి పోషణలోనే ఏదో అనిర్వచనీయమైన ఆనందం అనుభవిస్తూ గడిపేవాణ్ణి.

ఇలాగే పదిహేనేళ్ళు, శశిని ప్రాణంతో సమంగా పెంచి పెద్దజేసాడు తను. యిప్పుడు శశి కూడ అత్తవారింటికి వెళ్ళింది.

అమ్మ సుజాత పోయిన కొన్నాళ్ళకు పోయింది. అరుణ లేదు - అమ్మలేదు-సుజాతకూడ పోయింది-ఇప్పుడు తనకు శశికూడ లేదు. మూర్తిగారికి గతపు తలపులతో దుఃఖం పొర్లు కొచ్చింది...

ఉదయం పదిగంటలవుతోంది - మూర్తిగారు కోర్టుకు తయారవుతున్నారు. టైము కావస్తూంటే హడావుడిగా 'టై' ముడివేసు కొంటున్నారు.

'బాబూ - మీ కోసమెవరో వచ్చారు!'

'రమ్మను వెంకయ్యా!'

లోపలికివచ్చా రెవరో-కాదు ఆమె లోనికి వచ్చింది- ముప్పైఏళ్ళ యువతి.

'నమస్కారం మూర్తిగారు!'

మూర్తిగారు తలెత్తి చూచారు.

'నమస్తే' - ఆయనమాట పంకింది.

'ఎవరు?...ఎక్కడో చూచినట్లుగా వున్నది - గుర్తు రావడంలేదు.'

'గుర్తుందా మూర్తి'-మాటకూడ ఎన్నడో విన్నది లాగా ఉన్నదే-

అవును - ఈమె - ఈమె-అరుణ కదూ!...ఎన్నడో యుగయుగాల నాటి పరిచయం. ఆ నాటి అరుణే...

పిలుపులోని ఆ మార్దవం, మధురిమ అన్నీ ఆనాటివే.

స్మృతిపథంలో మాత్రం మిగిలిపోయిన ఆనాటి అరుణ పిలుపే...అరుణే...

'అరుణను మరచి పోయివా మూర్తీ. నేను మాత్రం మరువ లేదులే.'

'అరుణా. నువ్వా. అబ్బ. ఎన్నాళ్ళకి. ఎక్కడ ఉంటు న్నారు'

అరుణ నవ్వింది.

'ఏమిటి అరుణా. గొప్ప ఉద్యోగంలోనే ఉంటారులే. నాకు తెలుసు అయినా చెప్పుదూ. వారేం చేస్తున్నారు - అరె - కూర్చోమనైనా అనలేదే. రా. యిలా కూర్చో సోఫాలో.

అరుణ యింకా నవ్వుతూనే వుంది 'నే నింకా అవివాహితనే మూర్తీ. ఆనాడు మూర్తికి మనసిచ్చాను. మూర్తికి ఇవ్వవలసిన అనురాగాన్ని మళ్ళించలేను. ప్రేమను జూదంలా భావించలేను మూర్తీ...మూర్తి పాదాలమ్రోల చోటు దొరికేవరకు - ఈ జన్మ కాదు, ఇంకా పది జన్మల వరకూ కూడ అవివాహితగానే వేచి వుంటాను యిలాగే వుంటాను మూర్తీ'

మూర్తి శిలా ప్రతిమే అయిపోయాడు. ఎదురుగా వున్న సుజాత ఫొటోలోకి చూస్తూ

...[ornament]...

# సాగర కన్య

.. ఎవరో తరుము కొస్తున్నట్లు పరుగు తీస్తోంది జీపు అత్రంగా. హడా వుడిగా.

తారు రోడ్డుకీ, టైర్లకి మధ్య జరిగే సంఘర్షణలవల్ల లయగా శబ్దం నిశ్శబ్దంలో ఏకమౌతోంది. గగారిన్ అంతరిక్ష యానం చేస్తుంటే పొందిన అనుభూతివంటి అనుభూతి అసలు. అసలు అంతరిక్షయానంలో అనుభూతి దేవుడికి, ఆ గగారిన్‌కీ ఎరుకగాని, మా జీపు వేగాన్ని. ప్రయాణపు ఆనందాన్ని గగారిన్ వ్యోమయానంతో అన్వయించుకొని, ఓహో... ఇలాగే ఉండవచ్చునని, వేగం ఎక్కువకాబట్టి ఇంకా ఉల్లా సంగా, తేలికగా ఉంటుందని ఊహ మాత్రమే.

రహీమ్ డ్రైవరు చాల పాతవాడు. ఆ జీపుకారుకూ, అతనికీ చిరకాల స్నేహం. అతను ఎలా చెబితే అలా వింటుంది అది. జీపే కాకుండా ఆ మార్గంకూడ అతనికి సుపరిచితమే.

లోపల శేషూ భాస్కరం మోహన్ ఏదో సోది చెప్పుకుంటున్నారు. వాళ్ళకి రహీమ్ ప్రావీణ్యతగాని, జీపు వేగంగాని, పరిసరాలుగాని ధ్యాసలో లేవు. వారిలో వారికి ఏదో విషయంపై చర్చ జరుగుతోంది.

రమణ విశ్వం ప్రకృతి ప్రేమికులు, లిప్తకాలంలో పరిసరాలు వెనుకకు జారిపోతున్నా ప్రకృతిరమణి అందాన్ని ఆనందంగా. హాయిగా ఆస్వాదిస్తున్నారు. వేగానికి చల్లని గాలి లోపలికి ప్రవేశించి ముఖాలను గిలిగింతలు పెట్టున్నా ప్రకృతి సుందరి చల్లని నిట్టూర్పు అని ఏవో అన్వయించుకుని తృప్తిపడుతున్నారు. పులకించి పరవశిస్తున్నారు. ఇప్పటికే వారు భావకవులని గ్రహించే వుంటారు. కవిత్వం పిచ్చి ఆపాదమస్తకం విక్కగా వంటపట్టింది వారుభయులకీ. తరచూ ఏదో వ్రాస్తూ పత్రికలకు పంపుతూనే వుంటారు. కాస్తోకూస్తో సాహిత్యరంగంలో సానుభూతికూడా సంపాదించు కున్నారు.

యిహ నేను, సాంబు కొంతసేపు డ్రైవరు నడిపే విధానాన్ని పరిసరాల్ని చూస్తూ, కాసేపు మా సూపర్నెంటు లాల్‌తో గాసిప్ వేస్తూ కూర్చున్నాం. రమణ విశ్వాల్లా మాకు ఎలాంటి పిచ్చీ లేకపోయినా పరిసరాలు ఆహ్లాదకరంగా మాత్రం వున్నాయని తోచింది.

సూపర్నెంట్ లాల్ పంజాబ్ రాష్ట్రీయుడు. ఎర్రగా బొద్దుగా, పొట్టిగా మరుగుజ్జులాగా వుంటాడు శరీర ఘనపరిమాణానికి తగ్గ స్వరపేటిక లేదు. సన్నగా కీచుగొంతు. ఏ మామూలుగా మాట్లాడినా హార్మోనియం రీడ్ నొక్కినట్లు, పోట్లాడుతున్నట్లు, 'కీచు' మంటాడు. సాదాగా నిండుగా వుంటాడు సబార్డినేట్స్‌తో కలుపుగోలుగా వుంటాడు. ఆయన ప్రక్కనుంచుండే మనం ఆజానుబాహులమూ,

ఆయన ఒక పిపీలికము అనే భావంలాంటిది వ్యక్తమయిస్తుంది మనలో, మనం రాక్షసులము ఆయన చిన్నమనిషి అని అనిపిస్తుంది. వయస్సుకూడా చాలా వుంటుంది. ఆయన తమ్ముడు పంజాబ్‌లో ఏదో ఆఫీసరుగానే రిటైరయి ఆరేళ్ళు కావస్తున్నదట. తమ్ముడు రిటైరయిన ఆరేళ్ళతర్వాత ఇప్పుడు లాల్ రిటైరయినాడు.

పంజాబ్ వెళ్ళిపోయేముందు సాగర్‌లేక్ చూసి వద్దామని అనడంతో అందరం పిక్‌నిక్‌కు బయలుదేరాం. సాగర్ సరస్సు మాకు నలభై మైళ్ళదూరంలో వుంది. ఎత్త యిన కొండలమధ్య విశాలమైన చెరువు... పెద్ద ఆనకట్ట... ఆనకట్ట పొడవు రెండున్నర మైళ్ళుంటుంది. పెద్ద చెరువుతో పాటు అందమైన పెద్దతోట. అచ్చటి ప్రకృతి శోభను చూడ డానికి ఎంతోమంది వస్తూ పోతూ వుంటారు.

ఇది నసురుల్లాబాద్ జంగల్... మీకు తెలుసా... పూర్వం ఇక్కడే విపరీతంగా దోపిడీలు జరిగేవి... డెకాయి టిన్... యూ నో... అన్నాడు లాల్ కళ్ళు ఇంతలేసి చేసుకుని తిప్పుకుంటూ.

ఉలిక్కిపడ్డా రందరూ. అప్పటివరకూ ఆ ప్రదేశాన్నీ, అడవినీ రమణీయమైనదిగా చూసి ఆనందించిన మాకు అందరికీ ఆ పరిసరాలు వికృతంగా. భయానకంగా కనిపించినై ఎంతో సున్నితంగా, సుందరంగా కనిపించిన ప్రతిచెట్టు లోనూ, ప్రతి నవ పేశలంలోనూ క్రూరత్వం కనిపించింది.

ఒక కాలంలో దోపిడీలు విపరీతంగా జరిగిన ప్రదేశ మన్న మాట యిది !

దోపిడీలు... హత్యలు. ఈ పరిసరాల్లో ఎన్నో లూటీలు ఎన్నో కర్కశ హంతక చర్యలు వికృతంగా జరిగిన యీ భూమిని రక్త పంకిలం చేసివుంటయ్, భయంకరమైన హంతకుల దయారహితమైన కసాయి హస్తాల్లో ఎందరో ప్రాణాలు విడిచి వుంటారు... జాలిజాలిగా బలిపీఠపు బలహీనపు మేకల్లాగా. ఎందరో తమ ధన, మాన, ప్రాణాలను బలిచేసే వుంటారు.

పరిసరాలు అంతకు మునుపు ఎంత సుందరంగావున్నా, చరిత్ర వినిన వెంటనే సుందరతపై మసక వ్యాపించి, వికృతంగా, అసహ్యంగా కనిపిస్తున్నాయ్, ఆ ప్రదేశాలన్నీ.

ఇంత సుందరతలోనూ, శోభలోనూ ఎంత కాఠిన్యత దాగి వుంది !

శేషూ, భాస్కరం, మోహన్ తమ సోది కట్టిపెట్టి మా వైపు చూస్తున్నారు ఆతృతగా. కలవరపాటుతో లాల్ మహాశయుడు అందించిన వార్తమూలంగా ఆ మిత్రత్రయం హడావుడి అణగింది.

నల్లటి తారురోడ్డు మెలికలు తిరిగిపోతోంది. ప్రతి ఒకటి రెండు ఫర్లాంగులకే ఒక మలుపు ఎదురవుతోంది ఎదురుగా ఏమి వచ్చేదీ కనిపించదు. మెలికలతోబాటు రోడ్డు ఎత్తుపల్లాలు; ఒకోచోట రోడ్డు చిన్నగుట్ట ఎక్కినట్లు

ఎక్కితే ఎత్తునుంచి దిగేటప్పుడు ఏలోయలోకో దిగజారి పోతున్నట్లుగా కనిపించేది.

చుట్టూరా దట్టమైన అడవి అల్లుకుపోయి వున్నది. టేకుమొక్కల వెడల్పాటి ఆకులు పచ్చగా కళకళలాడు తున్నాయి. జీపు విసురుకు చల్లని అడవిగాలి దూసుకు వచ్చి హాయి గొల్పుతున్నది. సూర్యుడు అస్త్రాద్రి చాటుకుపోయినా ఆకాశం ప్రకాశవంతంగా సప్తవర్ణ సమ్మిశ్రమంగా చిత్ర పటంలా వుంది. కొద్ది సేపట్లోనే సప్తవర్ణాలు ఒక నిశీధ తమః జాలిమలో లీనమైపోయే సూచనలు కనిపిస్తున్నయ్. పరిసరా లలో అడవి పురుగులు గోల వ్యాపిస్తోంది. పిట్టలు కార్మికులు పగలల్లా శ్రమించి సాయంత్రం ఇళ్ళకు చేరుకున్నట్లు తమ తమ గూళ్ళకు చేరుతున్నయ్.

'శ్రీపురం వూళ్ళోకి కొయ్యావోయ్ హీమ్!' అన్నాడు లాల్ ...ఎదురుగా టర్నింగ్ చూపిస్తూ. తిరిగి మమ్మల్ని వుద్దేశించి 'శ్రీపురంలో మా స్నేహితుడున్నాడు. ఆయనను కూడా తీసికెళ్దాం' అన్నాడు.

పది నిముషాల్లో జీపు ఒక బంగళాముందు ఆగింది. లాల్ భారీ శరీరాన్ని ప్రయాసతో మోసుకొంటూ లోనికి వెళ్ళాడు. మరుక్షణంలో ఆ బంగళానుండి పెద్ద నవ్వులాట, కేకల్లాంటి సంభాషణ... స్నేహితుల అందులో వృద్ధ జంబు కాల పరామర్శ ఇలాగే వుండనోపు అని తీర్మానించు కున్నాము మేమంతా. మా లాల్ హార్మనీ ఉచ్చైస్వరం లాంటి కేకలు స్పష్టంగా వినబడుతూనే వున్నై.

పదిహేను నిముషాల తర్వాత ఒక భారీ విగ్రహంతో బాటు మా ఎదుట ప్రత్యక్షమయ్యాడు లాల్. ఆయన కూడ వృద్ధుడే. అయినా పుష్టిగా వున్నాడు.

తిరిగి మా జీపు 'సాగర్' రూట్ పట్టింది. పల్లానికి పరుగుతీసే ప్రవాహంలా పరుగు తీస్తోంది జీపు. అప్పుడే చీకటి కమ్ముకుపోయింది. జీపు హెడ్ లైట్లు జీపుముందు తారు రోడ్డుని కొంత మేరవరకు పరిచయం చేస్తున్నయ్. లాల్‌తో వచ్చిన స్నేహితుడు అంత హుషారుగా లేడు. లాల్ సహజ ధోరణిలో పెద్దగా అరుస్తూ చెప్తున్నా ఆయన అంత ఉత్సు కత కనబర్చటం లేదు. "నాకు ఇంటిదగ్గర ఎన్ని పను లున్నాయో తెలుసా...నీకు తోడుగా స్నేహితు లున్నారుగా. వెళ్ళి వస్తూ మా ఇంట్లో దిగితే బాగుండేది. అంతా అప్సెట్...హుఁ...!" లాల్ బలవంతాన లాక్కొచ్చినట్లు మాట్లాడుతూ, పిక్‌నిక్ ఆనందించే ధోరణిలో లేడు. ఒక గంటలో సాగర్ పరిసరాలు చేరుకున్నాం.

డామ్ మీది మెర్క్యూరీ బల్బులు దేదీప్యమానంగా వెలిగిపోతున్నాయ్. ఫ్లైడ్ లైట్ కాంతిపుంజం చాల మేర వరకు సాగర్ నీటిని వెండిమలామా చేసివేస్తున్నది.దూరంగా చెరువుమధ్య లేచిన చిన్న నల్లటి రాతిగుట్ట దట్టంగా పట్టిన పొగ మంచులో, మసక చీకట్లో మసక మసకగా, లీలగా కనిపిస్తోంది డామ్ ఆవలివైపున చిన్నగుట్టమీద డాబా నల్లగా జీబురు దెయ్యంలాగా వున్నది. ఆ గుట్ట క్రిందుగా

నాలుగైదు ఫర్లాంగుల దూరంలో ముసాఫిర్ బంగళాలోని గాజు కిటికీల్లోనుండి వెలుతురు పలకలు పలకలుగా కని స్తోంది... ...అద్దాల్లోనుండి, వెంటిలేటర్లలోనుండి.

డామ్ ప్రవేశించగానే పెద్ద పూలతోట మధ్య చిన్న బంగళా. దానిపేరు 'గుల్‌గస్త్.' దాంట్లో ఖాళీ వుండేమో నని ఆశపడ్డాం ఆ పరిసరాలు చూసి. కాని అంతకుముందే టూరిస్టులు ఎవరో ఆక్రమించుకున్నారు. డామ్‌మీదుగా లారీలు, కంట్రాక్టు వాహనాలు పోవడానికి వీలులేదు. జీపు ల్లాంటివి పోవచ్చు. డాం మీదుగా ఆవలిగట్టుకు బయలు దేరాము రహీం మెల్లిగా డ్రైవ్ చేస్తుంటే అంతా ఆహ్లాద కరమైన పరిసరాల్ని చూస్తున్నారు విశ్వం రమణ ఆ సుషమా లహరిపై కావ్యం అల్లుతున్నారు.

డామ్ చివరికి వచ్చాం. తిరిగి రోడ్డుకి చేరాలంటే చాలా పల్లానికి వెళ్ళాలి. డామ్ చివరినుండి రోడ్డుకి మెలికలు మెలికలురోడ్డు కొట్టవచ్చినట్లుగా కనికలుగా తిరిగి వెళ్లాల్సి వస్తుంది. చివరికి వచ్చినప్పుడే తెల్లగా మెలికలు మెలికలుగా పిస్తుంది. ఆ దారిని చూడగానే కోడెత్రాచు శరీరపు మెలి కలు, వయసులోని పడుచుపిల్ల వయ్యారం, వంపు సొంపులు, జవరాలి వేణీ బంధపు సౌందర్యం,నీళ్ళు వాలక బోసినప్పుడు ప్రవహించే తీరూ తెన్నూ లేని విధానమూ ఒకసారి స్ఫురిం చినై. నాకు రమణ విశ్వాల్లా ఎలాంటి కవితాదృష్టి లేక పోయినా.

ఆదారి ప్రవేశంలో "సాగర్‌స్పిల్ వే వ్యూ" అని

సూచన చేసివుంది. నీటి జరజరలాంటి స్పిల్ వే ఫ్ర్యాలో నిజంగా నీటి మెలికలులా కోడెత్రాచు నడకలా రమణీమణి వేణీబంధపు వయ్యారంలా రహీం జీపు నడుపుతుంటే లోపల మలుపుల్లో మేమంతా యిటూ అటూ కదులుతూ మెలికలు తిరిగిపోతూ ఒకరిమీద ఒకరు ఒరిగిపోతుంటే అదో ఆనం దంగా వుంది...

స్పిల్ వే ఫ్ర్యా దాటి...సాఫీగా వున్న తారు రోడ్డుకి ప్రాకింది మా వాహనం. పరిసరాలు చాలా ప్రశాంతవంతగా ఏదో అవాక్యమైన ఆనందాన్ని కలిగిస్తూ స్తబ్ధుగా ఉన్నాయి. గెస్టుహౌస్ సమీపిస్తున్న కొద్దీ కోలాహలం వినిపిస్తున్నది.

గెస్టుహౌస్ ముందు ఒక కంట్రాక్టు కారేజీ జీపు, రెండు మోటారుకార్లు విశ్రాంతి తీసుకుంటున్నాయ్. ఎంత దూరం నుండి ఎంతమందిని కష్టపడి మోసుకొచ్చినయ్యో మరి!... కంట్రాక్టు కారేజీ అడ్డదోవనుండి తీసుకొచ్చినట్లున్నారు.

జీపులు ఓ మూలగా ఆపి మా పిక్ నిక్ సామాన్లన్నీ అందులోనే వుంచి గదికోసం బయలుదేరాం.

౹ ౹ ౹

భోజనాలు పూర్తయిన తరువాత అందరం గైడ్ తీసుకొని నాలుగు మూలలు చుట్టివచ్చాం. గెస్టుహౌస్ చుట్టూ కొద్దిమేరతప్ప బయట అంతా నిశ్శబ్దం నిశీధిని తాండవం చేస్తున్నది. చిన్నగా నడకసాగిస్తూ, పొడుగ్గావున్న కాలిబాట వెంట మాట్లాడుతూ ముందుకు పోతున్నాం.

రోడ్డు కిరువైపులా కాపలా కాస్తున్నట్లు నిశ్చలంగా

నిలబడిన గుబురైన చెట్లు, దూరాన పొడుగైన సాగర్‌డామ్, మెర్క్యురీలైట్లు. ఇటు కుడివైపున చిన్నగుట్టమీద నల్లటి బంగళా నల్లగా మసిలాగ చీకట్లో కలిసిపోయి వికృతంగా ఉన్నది.

అది యాత్రికులకు వినియోగపడేందుకే నిర్మింపబడి ఉంటుంది. కాని ప్రస్తుతం పాడుబడ్డ ఆలయంలా నిర్మానుష్యంగా శాంతి విహీనంగా పాడుబడి ఉండడానికి కారణం ఏమైట్లై ఉంటుంద? సందేహం చంపుకోలేక గైడుని అడిగేశాను.

'ఆ బంగళాలో రాత్రిపూట దయ్యం కనిపిస్తదంట బాబుగారూ... అందుకని ఎవ్వరూ దాంట్లో వుండరు. రేతిరేళ ఒక ఆడమనిసి కనిపిస్తదంట !

వులిక్కి పడ్డాను నేను, నాతోబాటు సాంబు, శేషు. భాస్కరం, మోహన్, మొహాలు చూచుకున్నాం. లాల్ కూడ చలించే మావైపు తిరిగాడు. లాల్ స్నేహితుడు ఏమీ పట్టనట్లు యీలోకంలోనే లేనట్లు తలవంచుకుని తాపీగా నడుస్తున్నాడు

సాంబు వున్నట్టుండి, పగలబడి నవ్వాడు-బలవంతాన గుండె చేత్తో పట్టుకొని ఆపుకోలేక ఆపుకొని. నానె్సన్స్ దెయ్యమా దేవరా? నువ్వెప్పుడైనా ఆ దెయ్యాన్ని చూశావా ?!! అన్నాడు గైడుతో.

అబద్ధం కాదుసార్...నా కళ్లారా చూస్తేను! ఇక ఆడకూతురు... చామన చాయగా వుంటది. జుట్టు విరబోసు

కొని దీనంగా ఏడుస్తది సార్... ఎక్కువ వయస్సుకూడ వుండదు. ఎవ్వరూ ఆ బంగళాలో పడుకోరు సార్. పడుకొంటే... ఒకరాత్రి మీదపడి రక్కి నానా హంగామా చేస్తుంది సార్...!

'దయ్యాన్ని చూస్తారా?' సాంబు నవ్వాడు.

'నేను రాను సార్ ... బాబోయ్... మీకు భయం కూడా లేదే' వణికిపోయాడు వృద్ధుడు.

'మా సాంబును చూస్తేనా ఎంత ప్రేవోనో, దెయ్యం గియ్యం పారిపోవాలి అతన్ని చూచి. దెయ్యాన్ని చూసొద్దామా, ఆ బంగళాలో యీ రాత్రికి వుండి' అన్నాడు లాల్ ఆయన వృద్ధ స్నేహితుడితో.

'నాకూ భయమే లాల్. మీరు వెళ్ళండి! అన్నాడాయన ముఖం చిట్లించి. శరీరమయితే పోత పోసిన విగ్రహంలా వున్నది కాని, సాంబుకు వున్న ధైర్యంకూడ లేదు ఆయనకు. యిహ మా సంగతి సరేసరి...

అబ్బ ... చలేస్తోంది ... బంగళా లేదు, దెయ్యమూ లేదు... పదండి హాయిగా గదిలో మాట్లాడుకోవచ్చు ఈ చలిలో ఏమిటి చాంద్రాయణం నిశాచరుల్లా! అన్నాడు భాస్కరం. కాసేపు పూరుకుంటే సాంబు నిజంగానే కొండ మీద దయ్యం దగ్గరకు లాక్కొని వెళ్తాడనే భయంతో.

మేమంతా వంత పలికాం అప్పుడుగాని నిజంగానే చలి వేస్తోందని తెలియలేదు అందరికీ...

( ( (

గెస్టు హౌస్‌లో...మా గదిలో నిశ్శబ్దం ఆవరించింది అకస్మాత్తుగా. లాల్ సన్నని గొంతు నిశ్శబ్దాన్ని తరిమి వేసింది.

కొండమీద దయ్యం గురించి నాకు తెలుసు డియర్ సాంబూ!...వినే ఓపిక వుందా? ఎవరికీ నిద్ర రావడంలేదు కదా అన్నాడు లాల్.

చెప్పండిసార్!...చెప్పండి...ఒరేయ్ దయ్యం అనగానే మోహన్ నిద్రకు పట్టాడు. 'వెధవవేషాలెయ్యక లే... ఒరేయ్...దయ్యం కథకు "బయ్యం" అనడానికి అమ్మ ఒడి దిగని కుర్ర నాగమ్మవా... ఫూల్ ... లే..' అంతా నవ్వారు గలగలమని . . గాజులు శబ్దం చేసినట్లు.

లాల్ స్నేహితుడుకూడ అంత వుత్సుకత కనబరచడంలేదు.... ఆయన ఏదో మాగ్‌జైన్ తిరగ వేస్తున్నాడు.

'ఆపుస్తకం పారేసి యిటు నే చెప్పేది వినరాదూ!"

"మీరు చెప్పుకోండి...నాకు ఆసక్తిలేదు పిచ్చికథల్లో"

కాసేపు ఆయనవైపు తదేకంగా చూసి నవ్వుతూ లాల్ ప్రారంభించాడు.

"ఆ దయ్యం పార్వతిది" అన్నాడు లాల్ మరో సిగరెట్ ముట్టిస్తూ.

పార్వతి యిరవైఏళ్ళ పడుచు. గెస్ట్‌హౌస్‌లో కాపలాదారు వెంకన్నకూతురు. ఇరవైఏళ్ళక్రితం యిదే డివిజన్‌లో సూపర్నెంటుగా వుండేవాడిని. మల్‌హోత్రా అనే పోలీసు సూపర్నెంట్ నా స్నేహితుడు ఒకడుండేవాడు. అఖండుడులే,

ఖంగుమనే ఉక్కు శరీరం, ఆరడుగులన్నర మనిషి... ఒక్కడూ పది మందికి సమాధానం చెప్పగలిగేవాడు. తుపాకి బారు చేస్తే, ఎంత కోపిష్టి, రక్తదాహం కల పులి అయినా మరు క్షణంలో మూడు పల్టీలు కొట్టి నాలిక వెళ్ళబెట్టేది. అతను వేటకు వెళితే పక్కన కూర్చోటమే సరదాగా వుండేది నాకు. అప్పుడు తరచు యీ నసురుల్లాబాద్ అడవిలో వేటకు వచ్చే వాళ్ళం.

ఒకసారి సాగర్ చూడ్డానికి మల్‌హోత్రా, నేనూ జీపు వేసుకుని వచ్చాము. ఇప్పుడు ఈ ప్రాంతమంతా ఇంత విశాలంగా చక్కగా వున్నది గాని, అప్పుడయితే ఇదంతా అడవిలాగా వుండేది. సాగర్ డామ్ కట్టిన కొత్తలో యింకా పూర్తిగా యిప్పటిలా అభివృద్ధి కాలేదు

ఆ రోజు సాయంత్రం మేము వచ్చేటప్పటికి చీకటి పడ్డది. గెస్ట్‌హౌస్ టూరిస్టులతో కిటకిటలాడుతున్నది. గుల్ గస్త్‌కూడ. నలుగురు అమెరికన్ టూరిస్టులు ఆక్రమించు కున్నారు. పెళ్ళాం. పిల్లలతోసహా మార్టినీపెగ్ లగాయించి, "గిటార్" వాయిస్తూ.

మల్ హోత్రా ఈ జిల్లాలో అందరికి తెలుసు. అప్పుడు అతనంటే దొంగలకు గూండాలకు మాత్రమే కాకుండా, అతని సంగతి తెలిసిన ప్రతిమనిషికీ అతనంటే భయమే. మానినీ మధువులుంటే వేరే ప్రపంచమే అక్కర లేదు.

"గదులు లేవంటే ఎలాగయ్యా...ఎక్కడో" అక్కడ

వసతి చూపించాలి గాని, ఏడీ మీ ఇంజనీరును పిలువు" అని పిలిపించాడు ఇంజనీరుని ఇంజనీరు చేతులు నలుపుకున్నాడు. యీాయన ఆకారాన్ని చూసి వణుకుకూడ వచ్చింది.

"అన్నీ ఫుల్‌గా వున్నైసార్, చూడండి. ఆ గుట్ట మీాద ఒకటి కొత్తగా కట్టాం. కరెంటు లేదు. మరి అందులో వుండగలుగుతే, అన్నీ వున్నై. కరెంట్‌తప్ప నాకేం అభ్యం తరం లేదు వెంకన్నా! దొరగారికి లాంతరు పంపు!"

వెంకన్న బక్కపలుచగా, వణుకుతూ పడిపోయే ట్లున్నాడు. చాల ముసలివాడు వచ్చినవాళ్ళకు సదుపాయాలు చూడడం అతని వుద్యోగధర్మం.

"నేను కొండ ఎక్కలేను బాబుగారూ, కళ్ళు సరిగా కనిపించవు. మా కుర్రది అది అన్నీ చూస్తది బాబూ! అమ్మాయ్ పార్వతీ! బాబుగారికి లాంతరు బంగళాలో నీళ్ళుపెట్టి, చెత్తా చెదారం పక్కంది బాగుచేసిరా.

"పదండి బాబుగారూ! లాంతరు పెట్టి తర్వాత నీళ్లు తెస్తా"చేత్తో లాంతరు పట్టుకొని వచ్చింది పార్వతి. లాంతరు వెలుగులో పార్వతి నిగనిగ లాడుతున్నది. పల్లెపడుచు సౌం దర్యం. కాంతాదాహంగల మల్‌హోత్రా ఒక కంట కని పెట్టాడు పార్వతిని.

పార్వతి కావలసినవన్నీ అమర్చింది. మల్‌హోత్రా పార్వతి శరీరపు పొందిక చూసి వెర్రెత్తిపోతున్నాడు. పార్వతి వెళ్తే మళ్ళీ ఇలాంటి అవకాశం లభించదు. యిదే

సమయం పార్వతిని, పార్వతి బంతిలాంటి శరీరాన్ని తన స్వంతంచేసుకోడానికి, పార్వతి తనదే, తప్పదు.

"ఇకపోతా బాబుగారూ!"

"చీకటి పడ్డది బాగా. పొదలూ, ముళ్ళూ, ఇక్కడే పడుకోరాదూ! ప్రొద్దున పోవచ్చు" అర్ధోక్తిలో ఆగి పోయాడు మల్ హోత్రా పార్వతి అందాన్ని తాగేస్తూ.

"లేదు బాబుగారూ! ముసలాడికి కళ్ళు కనిపించవు. పక్కనుండకపోతే ఏపనీ జరగదు.చాలకష్టం. వెళ్ళొస్తా బాబు గారూ!" పార్వతి వెళ్తోంది.

"చీకట్లో ఎలా వెళ్తావే. నీ మనిషి అసాధ్యం కూలి పోనూ! పద నేనూ వస్తాను అక్కడివరకూ!"

"వద్దు బాబుగారూ, నే పోగల్ను. నా కలవాటే ఈ చోటంతా. మీరు దొరబాబులు. మీ కెందుకండి, రావద్దు. వుండండి బాబుగారు"!

అయినా బలవంతాన పార్వతికి సాయం బయలు దేరాడు మల్‌హోత్రా.

దారి పొడుగునా పల్చటి వెన్నెట్లో పార్వతిని ఆకలితో చూస్తూనే ఉన్నాడు. శరీరములో ధమనులు కాగిపోయి రక్తం పరుగులు తీస్తోంది. కొండ దిగారు. అన్నీ దుబ్బులు పొదలు,గుబురైన చెట్లు. అరమైలు వున్నది పార్వతి యిల్లు. పరిసరాలు నిర్మానుష్యంగా వున్నాయి. పొదల్లో నిశాచర జీవుల నీరసవేదనలు, సన్నగా వినబడడం తప్ప మిణుగురుల

మెరుపులు ఆరుతూ వెలుగుతూ వింత ప్రకృతిని సృష్టిస్తు న్నాయ్.

దట్టమైన పొదరిల్లు. పార్వతి ! భుజంమీద బలమైన హస్తం పడ్డది పార్వతి వెర్రిచూపులు చూచింది. ఆపాద మస్తకం కంపించిపోయింది.

విదిలించుకొన్నది పార్వతి. "బాబుగారూ !"

'నీ అందం ఎవ్వరికీ లేదే పార్వతీ నున్నటి భుజాలు మల్‌హోత్రా యినుప హస్తాల్లో వున్నై... పార్వతి మెసల డానికి శక్తి, అవకాశం రెండూ శూన్యం.

'ఛ... తండ్రిలాంటి వారు బాబుగారూ. మీకు మేలు జరుగదు ఆడకూతురిని అన్యాయం చేస్తే !

పార్వతిని తన పైశాచిక హస్తాల్లో బిగించేశాడు. విది లింపులు నిష్ఫలమే అయినై.

పార్వతి గిలగిలలాడింది. తల బాదుకొన్నది రక్కి- విదిలించుకోడానికి ప్రయత్నించింది. కాని మల్‌హోత్రా ఆజానుబాహువు కబంధహస్తాలు పార్వతిని వశం చేసుకు న్నయ్.

పార్వతి ఓపికలేక, ఎదిరించలేక మల్‌హోత్రాకు లొం గక తప్పలేదు. పార్వతికి ఆ వికృతమైన ఘడియవరకూ అనా ఘ్రాణిత సుందర సుమ లేమ. మల్‌హోత్రా మొరటుగా ఆఘ్రాణించి కర్కశంగా కాలరాసాడు.

మరునాడు వెళ్తూ వెంకన్నను పిలిచి "నీ కూతురు

మంచి పనిగత్తెరా, పది రూపాయలుంచు" అని యినాము కూడ యిచ్చాడు.

'మారాజులు. ఏదో కర్మరది. తల్లి యింతుండగానే చచ్చింది బాబూ! యింతకాడ్నించీ నేనే పెంచాను. తల్లి బతికుంటే యింకెంత యిదిగా ఉండేదో! నా పాణంలాగా పెంచాను.

వెంకన్నకు తెలియదు. తన కూతురు మానం విలువ, ప్రాణం విలువ పదిరూపాయలని.

' ' '

మర్నాడు పేపర్లో పడ్డది. 'సాగర్ గెస్ట్‌హౌస్‌లో పని చేసే వెంకన్న కూతురు పార్వతి కట్టమీదినుండి చెరువులో బడి చనిపోయిం' దని.

మల్‌హోత్రాను ఆ వార్త ఏమీ కదల్చలేదు. పాషాణ హృదయం.

ఈ దెయ్యం పార్వతిదే. తప్పకుండా పార్వతి క్షోభ పడిన ఆత్మ యీ పరిసరాల్లోనే తిరుగుతుంది.

నిండు ప్రాణాలు తీయడంలో మల్‌హోత్రా సిద్ధహస్తుడు అని బాగా అర్థమైంది నాకు. తను చేసిన పని ఒక నిండు ప్రాణాన్ని బలిగొంటుందని అతను వూహించి ఉండడు. తను చెలగాటంగా తీసుకున్న క్షణం పార్వతికి మృత్యు ఘడియ అని అనుకోలేదు మల్‌హోత్రా. యిలాంటివి యిది

వరకు ఎన్ని జరుగలేదు గనుక యిది క్రొత్త ఏమీ కాదు. యిలా పార్వతిలా ఎవ్వరూ ఆత్మహత్య చేసుకోలేదు.

అంతే కథ అని కళ్ళు మూసుకున్నాడు లాల్. ఆ రాత్రల్లా మాకు నిద్రలేదు. భాస్కరం మధ్య మధ్య ఉలిక్కి పడ్తూనే వున్నాడు.

మా జీపు తిరిగి బయలుదేరింది. గుల్‌గస్త్ ఆవరణ లోని పూదోటలో ప్రకృతి క్రొత్త అందాన్ని సంతరించు కొన్నది. అంతా మౌనంగా వున్నాం. ఏదో అనిర్వచనీయ మైన అనుభూతి, దీర్ఘమైన ఆలోచనకు లోబడిపోయి.

రహీమ్ మామూలుగా, అలవాటు చొప్పున బండిని జోరుగా తోలుతున్నాడు. శ్రీపురంలో లాల్ స్నేహితుని దింపి తిరిగి బయలుదేరింది మా జీపు. లాల్ స్నేహితుడు ఆ రోజు వుండిపొమ్మన్నాడు లాల్ మళ్ళీ వస్తామనీ, యిప్పుడు వీలుకాదనీ చెప్పాడు.

జీప్ తిరిగి తన వేగాన్ని పుంజుకుంది. నసరుల్లాబాద్ జంగిల్ ఒక రోజులో మల్‌హోత్రా స్వైరవిహారం సల్పిన ప్రదేశం. ఒకానొక చరిత్ర పుటలో హంతకులు, డాకూలు, క్రూర విన్యాసం చేసిన చోటు.

వున్నట్టుండి సాంబు అన్నాడు హఠాత్తుగా. 'మల్ హోత్రా ఎవరో నే చెప్తా లాల్‌సాబ్ !' అని. లాల్ ఆశ్చ ర్యపోయాడు మొహం విప్పారింది సాంబును ఆపి మా వైపు తిరిగి 'మీరు చెప్పండి చూద్దాం కెన్ ఎని వన్ ఆఫ్ యూ గెస్......డియర్ ఫ్రెండ్స్ !' అన్నాడు.

అంతా నోరు తెరిచాం 'పెన్ ప్రెజెంట్ చేస్తాను !' తన పార్కర్ తీసి పట్టుకున్నాడు ఓల్డ్ బేబీ.

"మీ శ్రీపురం ఓల్డ్ ఫ్రెండ్ !" సాంబు అరిచినంత పనిచేశాడు... పెన్ పోతుందేమోనని భయంతో. అద్భుతం!

"లాల్ ఆశ్చర్యపడిపోయి సాంబును కుదిలించేసి, నిజం ! సరిగ్గా ఊహించావు !" అన్నాడు

డ్రైవర్‌తో సహా అందరమూ నిశ్చేష్టులమయ్యాం!

# శకునపక్షి శాపం

కిష్టుడు వాడే గనుక యిప్పుడు నాదగ్గరుంటే అమాంతంగా మింగేసేవాడిని... అంత కోపమొస్తోంది. అపశకునపు పక్షి.

వాడి కెప్పుడూ హాస్యవేఁ, ఒకవైపు మనిషి 'అలో లక్ష్మణా'' అని చచ్చిపోతున్నా సరే వెధవ హాస్యం ఆడబోతాడు. నాకు అందుకనే మంట. సమయా సమయాలు చూసి విట్టరా అంటే వుహు. వాడి రెట్ట మతమే వాడిది. వాడికి తోచినట్లే వాగుతాడు. కాని మన మెన్ని విధాలచెప్పినా, ఎన్ని సలహాలు యిచ్చినా యీచెవిన విని ఆ చెవిన తక్షణం వదిలెయ్యడవేఁ... లక్ష్యం లేదు.

కేర్ లెస్ బోయ్. ఆ మాటే ఓ సారి అంటే గమ్మత్తుగా నవ్వి "నీకు తెలియదురా. అది అంతే మనం విచారాన్ని సంతోషాన్ని సమానంగా స్వీకరిస్తాం. మీరు లాభం లేదురా. ఎందుకూ పనికిరారు'' అన్నాడు.

"పోనీ వాడి తరహా నచ్చలేదు పోనిద్దూ. వాడితో మనకేం పని'' అని సరిపుచ్చుకుందామంటే, ఏదో పిచ్చి విషయం తెచ్చి నన్ను వాగించి విసిగించి నాచేత అనిపించు

కుని చివరికి ఎదురు నన్నే కుర్రాడినని, సినిక్ అని అంటాడు. తను పెద్ద అనుభవజ్ఞుడు, జీవితాన్ని కాచి వడబోసి తాగి జీర్ణించుకున్న ఓ శతవృద్ధుడు అయినట్లు.

ఇంత కసితో కిష్టుణ్ణి విమర్శిస్తున్నానని వాడు ఒకి పోకిరి అనీ సభ్యత తెలియని అకతాయి అనీ వెకిలి వాడనీ మీరు అపోహపడ్తే నేను తొందర పడ్డందుకు మీరు అలా అపార్థం చేసుకోడానికి దోహదకారిని నేనే అయినందుకు నన్ను క్షమించాలి.

నాకు ఒక ఫలానాపని తప్పకుండా చేయగలను అని ధీమా వున్నదనుకోండి. ఒకడు వచ్చి నువ్వు చేయలేవురా అంటాడు. నేను చేస్తాను అని ధీమాగా పోజు పెట్టాను. ఖర్మ కాలి ఆ పని నేను నా అంచనా ప్రకారం చేయలేక నా ప్రతికక్షి గెలిచి నేను ఓడిపోతే అప్పుడు నా మనసెలా వుంటుంది? బాధపడదూ? ఉక్రోషం రాదూ? ప్రతి కక్షిని మింగేయాలన్నంత కోపంరాదూ? మిమ్మల్ని నిలదీసి అడుగు తున్నానని అనుకోకండి. వుహుం, అసలు మనలో మనమాట. కోపం వస్తుందా రాదా చెప్పండి. వస్తుంది లెద్దురూ! ... ముహమాట పడ్తారేం.

అదీ సంగతి సరిగ్గా యిలాంటి పోలికలున్న సంఘటనే నాకు మా కిష్టుడికి మధ్య జరిగింది. నా కోపం [illegible]ద్ది వాడిని యింత పొగరున ఏకాగాని స్వాతిహాగా [illegible] [illegible]ంచివాడే. ఏ మాట కామాటే చెప్పాలి.

అసలింతకీ జరిగిందేమంటే నిన్న సాయంత్రం ఆరు

గంటలకు మా వెంకు "వై"రిచ్చాడు. ఆరింటికి "వై"రివ్వ లేదను కోండి! మాట పసందు మీకు పట్టకపోయినా సరిగ్గా చెప్పే విధి నాది. కాబట్టి, మీకు అర్థమయ్యేలా నేను చెప్పాలి కదా. మా వెంకు ఎప్పుడో యిచ్చిన వైరు నాకు నిన్న ఆరుగంటలకు చేరిందన్నమాట

"యిన్స్‌పెక్టర్స్ ట్రెయినింగుకు బరోడా వెళ్తున్నాను. ట్రెయిన్ దగ్గరకు రా" అందులోని సందేశం.

మా వూరు ట్రెయిన్ రూటులో లేదు. నాలుగో పంచవర్ష ప్రణాళిక కూడ మా వూరి వునికిని గుర్తించినట్లు కనబడదు. రైలులో వెళ్తున్న మా వెంకుని స్టేషన్లో కలుసుకోవాలంటే యిరవై మైళ్ళు బస్సు ప్రయాణం చేయాలి.

"వెంకు ఎవరు?" అని అడిగే స్వాతంత్రం, చనువూ మీకు నిస్సంకోచంగా వున్నై. వెంకు... వాడి పేరు వెంకు బాబు లెండి ముద్దు పేరు వెంకు. వాడిని మా మిత్ర బృందం "ఒరేయ్, వెంకూ!" అని సంబోధిస్తారు.

వెంకుబాబు అంటే ఎవరో మైనారిటీ దాటని, అభమూ శుభమూ తెలియని పసివాడు అనుకోనేరు. వాడి మైనారిటీ తీరి ఏడేళ్ళయింది సుమారుగా. కాబట్టి వాడూ ఒక మనిషి క్రింద జమే. వెంకును గురించి మన ప్రస్తుత సందర్భంలో తెలుసుకోవలసింది ఇంతే కిష్టుడి మీద నా కోపానికి వుపోద్ఘాతం యిస్తూ మరో వెంకుబాబు గురించి యింత నవల వ్రాయబూనుకోవడం సభ్యత కాదని "సభ్యత" అని

అంత పెద్దమాట మీరు వుపయోగించక పోయినా, పోనీ భావ్యంకాదని మాత్రం నేను గ్రహిస్తాను.

వెంకుని స్టేషన్లోగలవాలి, వాడికి వీడ్కోలు చెప్పాలి. రాత్రి ఎప్పుడో ఒంటి గంటకో, రెండు గంటలకో వెంకు వస్తాడు. అందుకని సాయంత్రం చివరి బస్‌కి వెళ్ళి వాడిని పంపి తెల్లవారి మొదటి బస్‌కి తిరిగివస్తే సరిగ్గా ఆఫీసు వేళకు రాగల్గుతాను. ఆఫీసు ఎనిమిది గంటలకి. మొదటి బస్సులో బయలుదేరి పూర్వం చాలా తడవలు ఆఫీసుకు సకాలంలో చేరాను.

తీరా 'వెళ్ళొస్తా'నని కిష్టుడితో చెప్పితే 'నీకు బస్సు అందినట్లే డ్యూటీకి వచ్చినట్లే. అంతా భ్రమరా భాయీ. పందెం వేస్తాను. నువ్వు బస్సుకు అందుకోలే'వని అన్నాడు సంకోచంకూడ లేకుండా కిష్టుడు.

ఇదివరకు రెండు మూడు దఫాలు మొదటి బస్సులో డ్యూటీకి చేరిన విషయం ఆసరాగా తీసుకుని ధీమాతో 'రాగల్గుతానులేవోయ్!' అన్నాను.

అదే ధీమాతో సెలవ పెట్టకుండా బస్సెక్కాను.

రాత్రి వెంకును కలిసాను స్టేషన్లో, వాడితో మాట్లాడుతున్నా తెల్లవారి డ్యూటీ గురించి ఫస్టుబస్సు గురించి ఆలోచనలు. అసలు కిష్టుడి వాక్కు అటువంటిది. అయినా ఇది ...కు రాగలిగాననే ధైర్యం చిక్కగా స్థిమితం లేకుండా ...చనలు

అర్థరాత్రి ఎప్పుడో రెండుగంటలకు వెంకటేసు వీడ్కోలు యిచ్చి స్టేషన్లోతప్ప తలదాచుకోవడానికి మరోచోటు లేదు. కాబట్టి మళ్ళీ వద్దామనే వుద్దేశ్యంతో స్టేషను బయటి కొచ్చాను. ఎదురుగా కాకాహోటలు వుంది.

కాకాహోటల్లో, చాయ్‌లో నల్లమందు 'లుపుతా రనిచెప్పి కిష్టుడే ఒకసారి నోటిదగ్గర కొచ్చిన టీ నీళ్ళను త్రాగకుండా చేసాడు.

వాడు వద్దన్నది నేను చేయాలని, వాడు "అసాధ్యము అన్నది నేను తేలికగా చేసేయాలని నాకు ఒక తిక్క పట్టు దల. వాడి నోట్లోనుండి ఏది వెలువడ్డా అంతా ట్రాష్ అనీ బాష్ అనీ ఒక తక్కువ అభిప్రాయం ఏర్పరచుకొన్న నేను కాకా హోటల్లో టీ తాగనే తాగాను ఒకరోజున కిష్టుడు చూడకుండా.

ఏ మాటా కిష్టుడు వూరికే అనడు అనీ వాడు మాట్లాడిన ప్రతిమాటలోనూ హాస్యం ధ్వనించినా, వాడు చేదులాంటి నిజం మాట్లాడతాడని అప్పుడు తెలుసు కున్నాను.

కాకా హోటల్లో టీ తీసుకున్న మరురోజు అదే వేళ్టికి అదే హోటల్లో అదే నల్లమందు (లాంటి' టీ త్రాగా లన్న తృష్ణ అనుభూతి,దానికి అంతరాత్మ ప్రోత్సాహంవ మర్నాడు కాకాహోటలుకి హాజరవక తప్పలేదు. ఒక వ్యసనంలాంటి మాదకత కలుగజేసిందంటే నల్లవ లాంటిదేదో కలిసి వుండాలి.

వెయిటింగ్ రూంలో ఎవ్వరూ లేరు నేనుతప్ప. ఆ నిస్తబ్ధత కేమిటి, టీ త్రాగడంవల్ల నేమిటి మెత్తటి వాలు కుర్చీలో మేను వాల్చగానే నిద్ర ఎప్పుడు పోయానో నాకే తెలియలేదు. అసలు టీ తాగి వెంటనే పడుకుంటే రోజుకన్నా బాగా నిద్రపడ్తుందట కూడా. నిజమే అయింది. ఇదికూడా మా కిష్టుడి సిద్ధాంతమే లెండి!

కాలపురుషుడు నా ధీమాకి, నిర్లక్ష్యతకు తెల్లవారి ఏడుగంటలవరకు గంటకొకసారి వికటాట్టహాసం చేసే ఉంటాడు రైల్వేస్టేషన్ ఆఫీసులో గోడ గడియారంలో ప్రవేశించి. పోతే ఆరుసార్లు నాకు, నా నిద్రకు భంగం కలుగకపోయినా ఏదో వికటాట్టహాసంమాత్రం నన్ను ఉలిక్కిపడి కుర్చీలో అమాంతంగా లేచి కూర్చునేటట్లు చేసింది.

సరిగ్గా బద్ధకంకూడా తీర్చుకోలేదు. హడావుడిగా ప్రక్కనే వున్న బస్‌స్టాండుకు పరిగెత్తాను.

బస్సు కదలబోతోంది ... యింజన్ రొదచేస్తోంది. బస్సు చుట్టూ భరించలేని వాసన ఆవరించింది. డీసెల్ ఆయిల్ వాసన నాకు తలనొప్పి. కిష్టుడయితే "ఎంతకమ్మగా ఉంది!" అంటాడు. ఎప్పుడూ పెడసరమేగా.

బస్సులో అటు డ్రైవర్ మహాశయుని నుండి యిటు వెనుక ఫుట్‌బోర్డువరకు గోనెసంచిలో తవుడు కుదేసి కుక్కినట్లు పాసెంజర్సు...

స్టాండింగ్ పాసెంజర్సు!

నానారకాల సుంకాలు చెల్లించలేని యస్జీవో ఆక్రందనంతో ఆ బస్సు రొదను సరిపోల్చుకొని బస్సును చూసి బాధ పడ్డాను. పాపం యస్జీవో మాదిరిగానే నేనికి ప్రయాణీకుల మోత.

బయలుదేరబోతున్న బస్సు ఫుట్‌బోర్డుమీద కాలాని చోటు సంపాదించుకోడంలో నా తెలివితేటలన్నీ ఉపయోగించాను.

బస్సు ఊరికే శబ్దం చేయడమేగాని వేగంమాత్రం పుంజుకోలేకుండా వుంది. అంతా ఆర్భాటంతప్ప అంత మందిని భరించే శక్తి ఆ బస్సుకి లేదు. ఇంజన్ ధ్వనితో చెవులు దిబ్బెళ్ళు పడిపోతున్నాయి.

బస్సు లోపల నానా రభసగా ఉంది. అందరూ ప్యాంటుజేబులూ, హిప్ పాకెట్లూ, పాతకాలపువాళ్ళు, స్టయిల్స ఎరగని వాళ్ళు జంగందేవర కమీజులాంటి మోకాళ్ళదాకే చొక్కాల పక్క జేబులూ వెతుక్కుంటు న్నారు చిల్లరకోసం, నోట్లకోసం.

కండక్టర్ అందరికీ టిక్కెట్లు ఇస్తున్నాడు. నేనూ చిల్లరలేక రెండు రూపాయలనోటు ఇచ్చి నా మొక్కు కూడా చెల్లించుకున్నాను. టికెట్ యిచ్చి దాని వెనుక రావలసిన చిల్లర వివరం వ్రాసి తర్వాత తీసుకొమ్మని గుంపులు తొల్చు కుంటూ లోపలికెళ్ళాడు.

టిక్కెట్టును చొక్కా చేతిమడతల్లో దూర్చి ఫుట్‌బోర్డు కడ్డీని గట్టిగా పట్టుకొని నిలద్రొక్కుకున్నాను.

"ఇంకెవరన్నా టికెట్టు తీసుకోవాలా సాబ్ !" కండక్టర్ అరుస్తున్నాడు.

ఎవరిగోడవల్లో వాళ్ళున్నారు. కొందరు జేబులు తడుముకుంటూ డబ్బులు జాగ్రత్త చేసుకుంటున్నారు. కొందరు నాబోటివాళ్ళు కునికిపాట్లు పడుతున్నారు నిద్రకు మొహం వాచినట్లు.

బస్సు కుదలింపులకి లోపల నిలబడినవాళ్లు ఒకళ్ళ మీద ఒకళ్ళుబరిగి కుస్తీలు పడుతున్నారు.

"ఇంకెవరండీ టికెట్లూ !" కండక్టర్ బిగ్గరగా దీర్ఘం తీసాడు.

'ఊహుఁ' జవాబు లేదు.

ఇంతలో ఎవరో పొలికేక పెట్టారు. "ఇక్కడ శ్రీపురం ఒకటి కావాలండి!" అంటూ అప్పుడే నిద్రనుండి లేచినట్లు, కండక్టర్ అడగడం అంతకుముందు అడగనట్లూ.

ఇందాకటినుండి అరుస్తుంటే మాట్లాడరేమండీ?"

"ఇప్పుడుమాత్రం ఏమయిందిలెండి !"

"ఏమవుతుంది? మీకు ఏమీకాదు. మీరు చక్కగా నవ్వుతూనే ఉంటారు. నా ఉద్యోగం ఊడితే పెళ్ళాంబిడ్డల్ని పంతను తోలి నేను మీ ఇంటికే వస్తాను 'పోషించండీ!' అంటూ."

"పోయే దేదో ఒంటరిగా ఎందుకూ, పెళ్లాం బిడ్డలతోనే పొండి" ఎవరో గుంపులో నుండి కేక వేసారు.

అంత ఉక్కలోనూ అంత తొక్కిడిలోనూ అందరూ పగలబడి నవ్వారు కడుపుబ్బా.

బస్సుమాత్రం పోతూనే ఉంది. నా గమ్యంకూడ దగ్గరవుతున్నదన్న మాటేగా.

ఎనిమిది గంటలకి ఆఫీసు... ఏడూ పది అయింది. బస్సు లంగరాల బోటులా ధీమాగా నడుస్తోంది. ఏడూ పది హేను కూడా అయింది. అదే స్థాయిలో ప్రయాణం జరిగితే నేను సరిగ్గా సమయానికి ఆఫీసు చేరడం అనుమానమే.

ఏడూ యిరవై... శ్రీపురం శివార్లు లీలగా కనిపిస్తున్నాయి.

బస్సు కాస్త వూగింది. వెనుకచక్రం 'పస్'మంటూ నేలకు కరుచుకుపోయింది మొరాయిస్తూ.

చిన్న కుదుపుతో అకస్మాత్తుగా ఆగిపోయింది బస్సు. వాన తాకిడికి వరిమొక్కలు నేలకు ఒరుగుతున్నట్లు ఒక్కొక్కళ్ళే ఆ కుదుపుతో వాలిపోతున్నారు ప్రక్కవారిమీద.

డ్రైవర్ సీటులోనుండి దిగివచ్చి కండక్టర్‌ని కేకేస్తూ:

"టైర్ పంచరయింధి దిగండో హోయ్!" అన్నాడు అంతకన్న ఉద్రేకిస్తూ.

అందరి ప్రాణాలు ఉసూరుమన్నాయ్. మొహాలు వేలాడేసుకొని, అంతా దిగుతున్నారు. నాకయితే అది విసిస్పృహ తప్పినంత పనయింది

ఏడున్నర అయింది. ఇంకా సగందూరం పోవాలి. ఇంకా ఇప్పుడు ప్రయాణించినంత వరకూ శ్రీపురం ఊళ్ళోకి కూడా ప్రవేశించలేదు బస్సు. పంచరు బాగుచేయడానికి వారిదగ్గర పరికరాలుకూడ లేవట.

"శ్రీపురం స్టేజీకి బస్సును నెట్టుకుంటూ పోదాం పదండి, కాస్త సహాయపడండి. మరోబస్సులో పంపిస్తాం మిమ్మల్నందర్నీ" అన్నాడు డ్రైవర్ అందర్నీ అర్థిస్తూ.

"భలేపని పెట్టావయ్యా? యివాళ... ఎంత అర్జంటు పని పాడుచేసావ్! వ్యవహారమంతా తలక్రిందు లయి పోయింది."

"పనిముట్లు లేకుండా బండి ఎట్లా తెచ్చావయ్యా. అంత అశ్రద్ధ అయితే ఎలా?"

ఏదో గొణుగుతూనే చివరికి శ్రీపురం బస్ స్టాప్ వరకూ లాక్కొచ్చారు బస్సుని.

ఏడూ ముప్పావు. మరోబస్సు ఇంత తొందరగా వస్తుందా! సూర్యుడు పైకి ఎగబ్రాకుతున్నాడు. కొద్ది కొద్దిగా కడుపులో మంట బయలుదేరింది. కాఫీకూడా పడలేదాయె! ఆఫీసుకు యింకా పావుగంట వ్యవధి. ఛీ! హాయిగా సెలవు పెట్టినా ఈ బాధ ఉండకపోనూ, కిష్టుడు—పాపిష్టుడు. వేధన—శాపం పెట్టకపోయినా బస్సు చెడేది కాదేమో!

వర ప్రొద్దు ఎక్కుతుంటే ఆకలేసి వంట్లో ఎలాగో తిక్క ఆలస్యంగా ఉంది. కడుపులో ఆత్మారాముడు ఒకటే యిదిగా 1 ఘోషిస్తున్నాడు.

అప్పుడే ప్రక్కనే వున్న అయ్యరు హోటల్లోకి ముగ్గురు జొరబడ్డారు అవురావురుమంటూ. ఒకడినిచూసి ఇంకొకడు హోటలులోకి బిలబిలమంటూ దూరుతున్నారు.

హోటలుని చూస్తేనే అసహ్యంగా వుంది. పదార్థాల మాట వేరే చెప్పాలా?

నేను వెళ్ళకూడదనుకున్నాను. ఇంకా రెండు నిమిషా లున్నది ఎనిమిదికి.

కిష్టుడే గెలిచాడు, బస్సు ఎంతకీ రాదే!

చిన్నపిల్లవాడు తన పంతం నెగ్గకపోతే గుక్కపెడతూ ఆడినట్లు, బస్సు రాకపోవడంవల్ల ఆలస్యమయిందని, ఆకలి వేస్తుందనీ, కిష్టుడు గెలిచాడనే ఉక్రోషం వచ్చి పెద్దవాడిని కాబట్టి ఏడవలేక ఏడుపువచ్చినంతపనై కోపం ఉధృతంగా వచ్చింది. ఆ కోపంలో, కోపాగ్నిలో బస్సూ, డ్రైవరూ, కండక్టరూ బస్సుల డిపార్టుమెంటూ, అంతా ఆహుతై పోయారు.

ఎనిమిదీ ముప్పై అయినా బస్సు జాడలేదు. ఆత్మా రాముణ్ణి అణచలేక అయ్యరు హోటలుకి దారితీసాను. నా నిష్ట, నియమం అన్నీ వదిలి ఆ మురికి కూపంలోకి చొర బడ్డాను.

రోజూ, బస్సు శ్రీపురం శివార్లలో చెడిపోతే అయ్య రుకు కావలసినంత వ్యాపారం.

జనాన్ని చూడగానే ఏవో పిండి క్రుమ్మరించి నీళ్ళు కలిపి చుయ్ మనిపించాడు అట్లపెనాన్ని. కాఫీ కెటిల్ కాఫీని

కాసిని (కాసినేం ఖర్మ పుష్కళంగానే) నీళ్ళు త్రాగింది. ఒకొక్కక్కడూ ఆదరా బదరాగా ఆవురుమంటూ ఆర్డరిచ్చి నవి అందుకుంటున్నారు

రోజూ ఇలాగే బస్సు చెడిపోయేట్లు చేయమని అయ్యరు వెంకటేశ్వరస్వామికి మ్రొక్కుకుంటున్నాడు.

వంటగదిలో చల్లారు ఇడ్లీలు, సాంబారు మళ్ళీ మంట మీదకు ఎక్కనై.

హోటల్లో ముదిరిపోయిన విత్తనానికి ఉంచేసిన లావు పాటి బెండకాయలాంటి వ్రేళ్ళు, ఎంతకీ చిరగని మైదాపూరీ లతో కుస్తీపడుతున్నయ్ ఒక టేబులు ముందు.

వానాకాలపు బురదనీళ్ళలాంటి కాఫీ నాసుగుతో జుర్రు తున్నాడు ముసలాయన

కాఫీ తాగి ఆయన కౌంటర్ లోకివెళ్తే 'ఇరవై పైసలూ, అంటూ కేక వేసాడు సర్వారావు

కాఫీ ఇరవై పైసలూ, అయ్యరుహోటలు గేదు పెరి గింది. చీకిపోయిన తాటాకు పాకయినా !

ఆ ముసలాయన నోరెత్తకుండా ఇరవైసలు పారేసి బస్సు స్టాపులోకి కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళాడు.

వెధవ చానసీళ్ళకు ఇరవై పైసలా ? ఒకడూ నోరెత్త టంలా. అందరూ అసలు ఎన్నడూ కాఫీ ఎరగనట్లు, కాఫీ రేటు తెలియనే తెలియనట్లు సర్వాయ్ అరచినంత పడేసి పోతు న్నారు.

20)

ఇంకో తిండిపుష్టిగలాయన రెండుప్లేట్లు యిడ్లీ చట్నీతో, సాంబారుతో విడి విడిగా తిని, పూరీలు పూర్తి చేసి దోసెకోసరం ఆర్డరు పడేశాడు.

తర్వాత తాపీగా కాఫీ తాగాడు.

సర్వర్ బిల్లు చదివేటప్పటికి, ఆయనకు చీమకుట్టినట్లు కూడా అనిపించలేదుగాని నాకు తలదిమ్మెక్కినంత పన యింది. నేను ముగ్గురు స్నేహితులకు పార్టీ యిచ్చినంత బిల్లు చేసాడా మహానుభావుడు.

ఎవరికివారు పట్టనట్లు వెళ్లిపోతున్నారు-డబ్బు చెల్లించి.

కాఫీమాత్రమే తెమ్మన్నాను నేను. ఎవడన్నా అయ్యరుతో కయ్యానికి సిద్ధపడ్తాడేమోనని చూస్తున్నాను కానీ ఎవ్వరిలోనూ చలనంలేదు. అయిదు పైసలతేడా - ఎవ్వరికీ కోపం తెప్పించలేదు నాకు తప్ప. అయ్యరుమీద కోపం వచ్చింది.

అయినా కాఫీ పావలా పెట్టినా త్రాగదలచుకొన్న వాళ్ళు ఎంత వద్దన్నా త్రాగక మానరు.

తిన్నాక డబ్బులు యివ్వనంటే కాలర్ పట్టుకుని మరీ వసూలు చేస్తాడు అయ్యరు.

ఇలా నెలకు నాలుగుసార్లు బస్సు చెడిపోయిందంటే అయ్యరు నెల తిరగకుండానే పాక పీకేసి డాబా లేపుతాడు అదే స్థానంలో.

అయ్యరుని కొరకొర చూస్తూ కౌంటర్లోనికి వెళ్ళాను - యిరవై పైసలూ! అని అరిచాడు సర్వర్.

కోపం ముంచుకొస్తోంది. అయ్యరుని నలిపేద్దామన్నంత వుద్రేక మొచ్చింది. కోపం అంతా, రూపాయి నోటుమీద చూపించి, జేబులోనుంచి దాన్ని కోపంగా, బలంగా లాగి కౌంటర్‌లోకి విసిరాను.

లోలోపలే 'హుఁ' యిత్యాది అనుకొనే లోపలే మారంగా బస్సు మోత వినిపించింది.

అయ్యరుమీద కోపం మరచిపోయి చిల్లర పోగు చేసుకుని జేబులో వేసుకోకుండానే గుప్పిటిలో గట్టిగా పట్టు కొని, బస్సుకోసం పరుగెత్తాను.

అసలేబస్సుఫుల్‌గా వుంది. దాంట్లోనే మనుష్యుల అందర్నీ ఓవర్‌లోడ్ చేసారు మళ్ళీ అయ్యరుగురించే ఆలోచనవస్తే ఎవడో కిర్రు చెప్పుతో కాలు తొక్కేసాడు ప్రాణం పోయే టట్లు. 'బాగుపడేవాళ్లు ఏదో విధంగా బాగు పడతారు ఆలో చన, కసి, ఎందుకోయ్ పిచ్చివాడా, పసివాడా' వుపదేశం చేసినట్లు.

సరిగా వూళ్ళో దిగేప్పటికి తొమ్మిదయింది. యింకా యింటికి ఏం వెళ్ళను... ఆఫీసువైపు సాగించాను.

కిష్టుడి తలచుకొంటుంటే శరీరంమీద తేళ్ళూ జెర్రులూ ప్రాకుతున్నట్లున్నది... దగ్గరుంటే వాణ్ణి ఏమి చేసే వాడినో మరి... అదండీ సంగతీ! కిష్టుడిమీద నా కోపానికి కారణం యిది...

అరె! కండక్టరు దగ్గర రావలసిన డబ్బులు తీసికోవడం మరచిపోయానే! అన్నీ అపభ్రంశపు పనులే.

ప్రతి వ్యవహారానికి నాకు అలా అపశ్రుతులు పలకడం భావ్యమా చెప్పండి !

తలవంచుకొని అధికారికి కనుపించకుండా, నా టేబుల్ దగ్గరకు చేరాను. నాకు కిష్టడిమీద కోపమెందుకు! వాడు శపిస్తే బస్సు చెడిపోయిందనుకోడం నా పిచ్చిగాక మరొకటి కాదనుకొంటూ, ఓరగా కిష్టాయ్‌వైపు చూచాను. కిష్టుడు ముసి ముసి నవ్వులు నవ్వుతున్నాడు.

వాడి నవ్వుతో మళ్ళీ చిర్రెత్తుకొచ్చింది నాకు.

ఒకవైపున నవ్వు వస్తున్నా, ఆపుకొనేందుకు విశ్వ ప్రయత్నం చేస్తూ-కిష్టుణ్ణి చూసి 'హుఁ' అన్నాను

"ఆఫీసుకు ఇంత తొందరగా దయచేసారేం దొర గారు" అన్నాడు కిష్టుడు మెల్లగా.

కిష్టుడు నిశ్శబ్దంగా పొట్టపట్టుకొని టేబులుమీద పడి విరగబడి నవ్వుతున్నాడు.

ఏం చేస్తానూ ? నాకూ నవ్వాగింది కాదు.

~ ౦౦౦ ~
~ ౦౦ ~



రచయిత : కమలాకాంత్

జననం : 18-2-41

జన్మస్థలం : గుంటూరు జిల్లా. చెరుకుపల్లి.

ఉద్యోగం : పోస్ట్స్ అండ్ టెలిగ్రాఫ్స్. నిజామాబాద్ జిల్లా.

హాబీ : సాహిత్య పఠనం - రచనా వ్యాసంగం.

ఆంధ్రపత్రిక. ప్రజామత. చుక్కాని. ఆంధ్రభూమి. ఆంధ్రజ్యో
పత్రికలలో వెలువడి వీరిరచనలు ప్రశంసలనందు కొన్న
వీరు "సితారా" కలం పేరుతో గేయాలు కూడా రాస్తూవుంటారు.

యితర రచనలు : పుస్తక రూపంగా.

1. జీవితంలో మలుపు (కధలు) 2. మమత-మానవత (నవల)

3. ఆకధ అంతే (నవల) 4. .... (నవల).

---

టైటిల్ : "వెంకటరత్నా

## Check List

| Book Number | PAKOI A 143 | Date | 15/02/22 |
| --- | --- | --- | --- |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 161 | | |
| Missing Pages | NO | | |
| Prepared By | Ch. Ramya | Cutting By | ch. Ramya |
| Scanned By | Sandhya | Pages | 165 |